ప్రథమ ముద్రణము: 1000 ప్రతులు

**March, 1959.**

(మూల్యము: R 1. and 85 np )

ఇతర కృతులు

స్వప్నానుభూతి (కావ్యము)
కర్ణుడు ,,
త్యాగము ,,

★

Vivekananda Press,
NELLORE

# విన్నపము



షేక్స్పియర్ మహాకవి నాటకములు ప్రపంచ సారస్వతమునందు అగ్రస్థాన మలంకరించియున్నవి. అందు నాటక చతుష్టయమని పేర్కొనదగినవి క్రమముగా హామ్లెట్ (Hamlet) లియర్ (King Lear) ఒథెల్లో (Othello) మెక్ బెత్ (Macbeth) అనునవి. మెక్ బెత్ **నాటకమును** నేను బి. ఏ., ఎం. ఏ , పరీక్షలకు పాఠ్యగ్రంథముగా చదివియుంటిని. విద్యార్థులకు పాఠమును చెప్పియుంటిని. విశ్వజనీనమైన కథా సంవిధానమును భావములును గలిగి, మెక్ బెత్ నాటకము అనుకరించుట కత్యంత మనుకూలముగా నుండుటచే ఈ రచన కుద్యమించి కొన్ని సంవత్సరములకు పూర్వమే ఒకటి రెండు దృశ్యములను వ్రాసితిని. ఆవల దానిని విస్మరించి సారస్వతముతో సంబంధ బాంధవ్యములు తొలగిపోయినవి కాబోలు ననుకొని యే రచనయు తలపెట్టకుంటిని. అట్టిస్థితిలో డా॥ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారితో పరిచయభాగ్యము లభించినది. శ్రీ రెడ్డిగారు నెల్లూరులోనుండిన కాలమంతయు సాహితీ వినోదములకే వినియోగించిరి. ఎన్నియో కవితాగోష్ఠులు జరిపిరి. సాహిత్య చర్చలుసాగించిరి. నూతన వాతావరణము కల్పించిరి. ఆంధ్రాంగ్లముల నా రచనలను వారికి వినిపించితిని. రవీంద్ర సాహిత్యమున వారి రచనలను ముద్రితాముద్రితము

లను వింటిని చదివితిని. కవి పండితుల దెస వారు చూపిన గౌరవాభిమానములు మఱువరానివి. వారును మఱువఁజాలనివి. అట్టి వాతావరణములో సహజముగా నుద్భవించి వర్ణసమ్మేళనము పొందిన కవితాప్రసూనమే యీరచనము. శ్రీ గోపాల రెడ్డిగారి ప్రోత్సాహముచేతనే నాటకము సంపూర్ణమై రసజ్ఞుల మెప్పులకు పాత్రమైనగని మనవి చేయుచున్నాను.

ఇది ప్రత్యక్ష రాంధ్రీకరణము కాదు. మూలములోని ప్రధాన కథాంశమును ప్రముఖ పాత్రములను గైకొని, హైందవ సంప్రదాయమున కనుగుణముగా, నేటి మన తెనుఁగు రంగస్థలమున ప్రయోగించుటకు యోగ్యముగా నుండవలయు నను సంకల్పముతో వ్రాసితిని. మూలములోని కొన్ని దృశ్యములను ఉదాత్తభావములను అట్లే అనువదించితిని. కొన్ని నూతన పాత్రములను కల్పించితిని. సంక్షేపించితిని, విస్తరించితిని. మొత్తముమీఁద మూలములోని రసస్ఫురణ చెడకుండు నట్లు, ఆంగ్లగ్రంథముతో పరిచయము లేనివారి కిది స్వతంత్ర కల్పనగానే స్ఫురించునట్లు కూర్పుగావించితిని. ఇందెంతవఱకు నేను కృతార్థుఁడనైతినో ఉభయభాషాకోవిదులగు సహృదయులే నిర్ణయింప నర్హులు.

## కావ్యగోష్ఠి

గ్రంథము పూర్తియైనపిదప అందలి గుణదోషములు తెలిసికొనఁగోరి, సింహపుర న్యాయవాదిప్రముఖులు, గూపక

స్వహూపాభిజ్ఞులు, విమర్శకశ్రాకోవిదులు నగు శ్రీ తూములూరు శివరామయ్య పంతులుగారికి గ్రంథమునిచ్చి మీ యభిప్రాయము తెలుపుఁడని కోరితిని. నాటకములందు వారికిఁగల గాటపుఁబ్రీతిచేతను, నాయందలి వాత్సల్యముచేతను, శ్రీ శివరామయ్యగారు శ్రమకోర్చి గ్రంథము నామూలాగ్రముగా పరిశీలించి మూలముతో సరిపోల్చిచూచి "సారముగ్రహించి చక్కఁగా వ్రాసితిర"ని అభినందించిరి.

తే 8-10-54 శుక్రవారము సాయంకాలము శ్రీ శివరామయ్యగారి భవనమున కావ్య పఠన గోష్ఠి జరిగినది. పుర ప్రముఖులు, కవి పండితులు, విద్యార్థులు పెక్కుమంది సభకు విచ్చేసియుండిరి. నేఁడు కేంద్రప్రభుత్వ ఆర్థికవ్యవహార మంత్రి వర్యులు శ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షపీఠ మలంకరించిరి. పఠనానంతరము పండితవరేణ్యులు శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు ఉపన్యసించుచు ఇంతిమంది శ్రోతలు కదలక మెదలక నిశ్శబ్దముగా నింతసేపు పఠితము వినుటయే నాటకమునందలి రసస్ఫూర్తికి తార్కాణమని గ్రంథ గౌరవము నుగ్గడించిరి. శ్రీ గోపాలరెడ్డిగారు నాటకమును ప్రశంసించుచు రంగస్థలమున ప్రయోగమును తిలకించుటకు కుతూహలముగా నున్నదని తత్కార్యభారము శ్రీ శివరామయ్యగారి మీఁదనే నెలకొల్పిరి ముమ్ముందు ఇతర మండలములందు నాటక ప్రయోగమున కవకాశము కల్పింపఁగలసని వాగ్రుచ్చిరి. ఉన్నత దేశపరిపాలనాభార ధూర్వహులైన

శ్రీ గోపాలరెడ్డిగారివంటి రసజ్ఞులు గోష్ఠి నధ్యక్షించుట నా యదృష్టము. అత్యంతవైభవోపేతముగా గోష్ఠి జరిపించిన ఉదారులు శ్రీ శివరామయ్య పంతులుగారికి నా కృతజ్ఞత కృతిముఖమున ఆవిష్కరించుచున్నాను.

కావ్యగోష్ఠి వృత్తాంతము 22-11-1954 'త్రిలింగ' పత్రికలో ఇట్లు ప్రకటితమై యున్నది.

"గుణగ్రహణ ప్రవణులు శ్రీ తూములూరు వెంకట శివరామయ్య పంతులు (అడ్వొకేటు) గారు ఆహ్వానించిన సాహిత్యగోష్ఠిలో వారి విశాలసౌధమున తే 8-10-54 ది శుక్రవారము సాయంకాలము శ్రీ దుర్భా రామమూర్తి ఎం. ఏ., (కళాశాలలో ఆంగ్లోపన్యాసకులు) మ్యాక్ బెత్ నాటకమును ఆధారముగాగొని తాను రచించిన 'రాజ్యకాంక్ష' యను దృశ్యవస్తువును చదివి వినిపించిరి. సభకు విద్వద్విద్యార్థి బృందమేగాక పౌర రసికవతంసులు పెక్కండ్రు విచ్చేసి యుండిరి. శ్రీ శివరామయ్యగారి ఉపపాదనముమీద శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు గోష్ఠి నాయకత్వము వహించిరి. శ్రీ రామమూర్తిగారు 13 రంగములుగా విభక్తమైన తన రూపకమును రెండుగంటలసేపు అనర్గళధోరణితో అక్కడక్కడ మూలమును జ్ఞప్తిపఱచుచు భావస్ఫోరకముగా చదివిరి. సభకు విచ్చేసినవారిలో శ్రీ నేలటూరు రామదాసయ్యంగారు ఎం.ఏ. పఠనాంతమున కవి నాశీర్వదించుచు ఇంతమంది శ్రోతలు కదలక మెదలక నిశ్శబ్దముగా నింతసేపు పఠితము వినుటయే

నాటకములోని రసమునకు దార్కాణమని యుగ్గడించిరి. శ్రీ శివరామయ్యగారు, శ్రీ గోపాలరెడ్డిగారును ఈవఱకే చదివి కావ్యమందలి రచనా రామణీయకము గుఱితించి యుంటి మని మొదటనే ముచ్చటించి యుండిరి. శ్రీ రెడ్డిగారు ఈ నాటకము త్వరలో నాడించుభారముగూడ శ్రీ పంతులవారిమీద నే బెట్టిరి. ఎట్లైననేమి పౌరులందఱును ఈ మనోహర దృశ్యమును రంగస్థలమున దిలకింప కుతూహలురై యున్నారనుట నిక్కము. ఫలపుష్ప తాంబూలాదికముతో, అత్యంత సౌహార్దముతో నడచిన ఈ సుహృద్గోష్ఠి రాత్రి 8 గంటలకు పూర్తియయ్యెను. మహామహులు, గౌ॥ బెజవాడ రామచంద్రారెడ్డిగారును, మహోపాధ్యాయులు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారును సభకు వచ్చియుండిరి." (త్రిలింగ 22-11-54)

## ప్రదర్శనము

శ్రీ తూములూరి శివరామయ్యగారి ప్రోత్సాహముచే తనే ఈ నాటకమును నెల్లూరు అమెచూర్సు సభవారు 26-3-55 శనివారము సాయంకాలము నెల్లూరు పుర మందిరమున రసవంతముగా ప్రయోగించిరి. ప్రదర్శనము ప్రారంభించుచు శ్రీ శివరామయ్యగారు నాటక ప్రాముఖ్యమును ప్రశంసించిరి. శ్రీ గోపాలరెడ్డిగారును, శ్రీ వల్లభజోస్యుల సుబ్బరావుగారును, (Principal, Hindu College, Guntur) పంపిన సందేశములు చదువఁబడినవి. శ్రీ గోపాలరెడ్డిగారు:—

"షేక్స్పియర్ నాటకానుకరణమగు "రాజ్యకాంక్ష".ను నేను స్వయముగా వినుటయేగాక, శ్రీ తూములూరి శివరామయ్య గారి గృహమున నెల్లూరు ప్రముఖుల పండితుల సమక్షమున తదావిష్కరణమునకు అధ్యక్షత వహించు భాగ్యమును నాకు లభించినది. ఈ నాడు రంగస్థలమున ప్రదర్శింపబడునని విని చాల సంతోషించితిని. స్వయముగా వీక్షింపగలననియు ఆశించితిని. నా కాంక్ష సిద్ధించలేదు. శ్రీ రామమూర్తిగారిని ఇంతకుమున్నే వారి రచనకు అభినందించియుంటిని. నటీనటుల ముఖతః వారి సంవాదనలు వినలేక పోయినందులకు చింతించుచు, ఈ నాటి ప్రదర్శనము రసవంతమై ఆహ్లాదకరముగ నుండగలదనియు, మున్ముందు ఇతర మండలములందును ప్రదర్శింపబడగలదనియు ఆశించుచున్నాను. ఈ నాటి ఆహ్వానము మన్నింపలేక పోయినందులకు క్షమించ ప్రార్థన."

శ్రీ వి. సుబ్బరావుగారు:—"I am glad to hear that my friend Sri D Ramamurty's rendering of Macbeth is going to be presented on the Telugu stage It is good that Sri Ramamurty has chosen a great tragedy as his first dramatic venture. The tragic concept of life is alien to the Indian mind, and the absence of "tragedy" as a dramatic form is one of the defects of our ancient culture Besides its cathartic effect, the idea of a conflict between good and evil, in which, though evil is ultimately crushed, good too is wasted, is a challenge to the spirit of justice in man, and there is nothing that stirs a noble heart so powerfully to rebel against this iniquity as the literature of tragedy.

With indigenous scholarship as a heritage, and mastery of English as a beloved acquisition, Sri Ramamurty is well qualified to present the great masterpieces of English Tragedy to the readers and audiences of Andhra, and I hope he will have the recognition that he deserves from a grateful and qualified public I wish "Rajya Kanksha" all success on the stage "

సుప్రసిద్ధనటులు శ్రీ గాడేపల్లి రామయ్యగారు 'వీర సింహా' పాత్రమును నిపుణముగా నిర్వహించి సభ్యుల మన్ననలకు పాత్రులైరి. అట్లే తదితర పాత్రములను సమర్థతో నిర్వహించిన నటీనటవర్గమునకు నా అభినందనములు. ప్రదర్శన కార్యభార మంతయు జయావహముగ నిర్వహించుటకు తోడ్పడిన శ్రీ గాడేపల్లి రామయ్య, శ్రీ చివుకుల సత్యనారాయణ మూర్తి, బి. ఏ., బి. ఎల్., శ్రీ బి. విశ్వనాథం, బి. ఏ., బి. ఎల్., శ్రీ చతుర్వేదుల సత్యగోపాలకృష్ణమూర్తి, శ్రీ కొప్రా నరసింహం మున్నగు మిత్రులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనము లర్పించుచున్నాను.

## కృతిముద్రణము

వదాన్యశేఖరులు 'శివభారతా'ద్యనేక మహాకావ్య ప్రకాశకులు, ఏతత్కృతి ముద్రణార్థ సర్వస్వ ప్రదాతలు, శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారితో నాకు ఇరువది వత్సరములనుండి పరిచయమున్నది. 1935 సం॥ నా 'స్వప్నానుభూతి' కావ్యము వెలువడినప్పుడే వారు నా కవితారచనలను గుర్తించిరి. నాఁటి

నుండి నేటివఱకును నేను వ్రాసిన కావ్యములను ముద్రించి ఆంధ్రపాఠక లోకమున కందించినవారు శ్రీ రామిరెడ్డిగారే. అనువత్సరము 'తిక్కన జయంతి' మహోత్సవమున శ్రీ రెడ్డిగారు గావించు కవి సమ్మానమును 1946 సం॥ నా కొసంగి బహూకరించిరి. ఇట్లు నా యెడల అవ్యాజానురాగము నెఱపుచున్న శ్రీ రామిరెడ్డిగారి యౌదార్యమునకు కృతజ్ఞత తెలుపుకొనుట తక్క నేను చేయఁగలది యేమికలదు? పరమేశ్వరుఁడు వారికి ఇతోఽధికాయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుగావుతమని ప్రార్థించుచున్నాను.

ఈ నా రచనమును శ్రీ రామిరెడ్డిగారికి అంకితమొసంగి వారికి నేను పడియున్న వాత్సల్య ఋణభారమును కొంతకు గొంత తీర్చుకొనుచున్నాను.

ఈ నాటకము వ్రాసిన పిదప, భారత కేంద్ర సాహిత్య అకాడెమివారు షేక్స్పియర్ 'హామ్లెట్' (Hamlet) నాటకమును నాచే అనువాదము చేయించుకొనిరని తెలుపుటకు సంతసించుచున్నాను.

నెల్లూరు,
15—12—58.

దుర్భా రామమూర్తి.

# నమస్కృతి

★

రమణీయంబగు ప్రాచ్య కావ్య
విమలారామంబులన్ ద్రిప్పి, త
త్సుమ సౌగంధ్యము తన్మరంద రస
మాధుర్యంబునున్ నాకు భో
గ్యములన్ జేసి వినూత్న కావ్యకృతి
కాంక్షన్ గొల్పె నే పూజ్యుఁ డె
య్యమృతానందవచస్కున్ మత్పితను *
కృత్యాదిన్ బ్రశంసించెదన్.

పితయంచున్ గయిమోడ్తు, స్వీయ కవితా
పీయూష ధారాభినం
దిత సర్వాంధ్రకవి ప్రపంచుఁ డనుచున్
గీర్తింతు, వేదాంత సం
తత చింతాపరిలబ్ధబోధుఁ డనుచున్
భావింతు, మన్మాతృ దే
వత పుణ్యైక ఫలంబు, ప్రేమమయు
సుబ్రహ్మణ్యశర్మాహ్వయున్

---

* కీ. శే 'సాహిత్యస్థాపక' 'మహోపాధ్యాయ' 'అభినవతిక్కన'
బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు



# అంకితము

వదాన్యశేఖరులు

## శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారికి

దినమణి యన్వహంబు నిజదీధితి సంహతి విశ్వ కావ్య సృ
ష్టిని వెలిఁగించుకైవడి విశిష్ట కలాఢ్య కవీంద్ర కావ్య క
ల్పనలకు రూపవిభ్రమ విలాసములన్ సమకూర్చు కీర్తివ
ర్ధను ఘను రామిరెడ్డిని వదాన్యశిరోమణి నుగ్గడించెదన్

రమ్య సువర్ణ సారస్వత దేవతా సౌధమ్ము నిజనివాసమ్ముగాఁగ,
భావార్ధ రసపూర్ణ భవ్యానుభావమ్ము స్వాదుఫలాహార సరణిగాఁగ
పటుకావ్య నిర్మాణ పాండితీ చణులైన కవికోటి బంధువర్గమ్ముగాఁగ,
తిక్కన నన్నయాది కవీశ్వరార్చన సర్వేశ మహితపూజనముగాఁగ,

సతత సాహితీవ్రత సమాసక్తబుద్ధి
నిస్తులానంద సంతుష్టి నెగడు విబుధ
మాన్యునికి రామిరెడ్డికి ధన్యమతికి
ఏను సంప్రీతి అంకితంబిత్తు కృతిని

గుణములున్ దోషము రెంటిఁ గన్గొని యసంకోచమ్ముగా నెందు నే
గుణమున్నన్ వెలకట్టి మెచ్చెడి రసజ్ఞుం డీతఁ, డిప్పట్టునన్
గణనీయంబని తాను చేకొనిన మత్కావ్యమ్ము కావ్యంబులన్
గణనీయంబయి మించుఁ గావుత కళాకాంతుల్ ప్రసారించుచున్.

కలిమి వివేకమున్ విమలగౌరవమున్ గవితావిమర్శకా
శలము విశారదత్వమును సన్నుతికెక్కఁ బురాతనాంధ్ర భూ
పుల ప్రతిభా యశశ్శుభవిభూతికి వన్నెఘటించుచున్న మీ
యలఘుకళాభిమానమున కంజలి పట్టెద, రెడ్డిరాణ్మణీ!

పద్యమల్లుట యొకసాటి ప్రౌఢియగును,
కవితచెప్పుట హెచ్చిన ఘనత యగును,
కవుల హృదయమ్మెఱుంగుటే కవనమైన
కలముపట్టని నిక్కంపు కవివి నీవు.

చెదరని మైత్రితో మనుమసిద్ధి నృపాలుఁడు తిక్కనార్యుఁడున్
విదిత మహాంధ్రవాఙ్మయ పవిత్రసవిత్రిని గొల్చినట్లు, స
మ్మద మెసలార మీరు మఱి మత్పితృపాదులు నాప్త మిత్రులై
పొదలిన కాలమిప్డు తలఁపోయఁగ డెందము పుల్కరించెడిన్.

జగమతి నాదుతండ్రి గరువంబున నన్నొక మేలికానుకగా
కరమనురక్తి మీకరయుగమ్మున నుంచెను, మీరు ప్రేమతో
అరసిరి, మీ మహాభ్యుదయమానిది, దీనిని గాంచుచోఁ బ్రియం
బగువడి నెంతగా మురిసియుండునో మజ్జనకుండు, ధీనిధీ!

తాతలనాఁటి విద్య కవితాకళ నన్నిటు చేరవచ్చి నా
చేత రచింపఁజేసె రససిద్ధ వినూతన దృశ్య కావ్యమున్
ప్రీతియు గౌరవమ్ము చివురింపఁగ మీకిటు లిచ్చినట్టి నా
యీ తొలి యప్పనంబుకొనుఁడీ యభిమానపురస్సరంబుగాన్.

త్రిదశ వసంతపుష్ప మధురీకృతమై హృదయైకవేద్యమై
పదముల సౌహృదప్రణయ సంభృతమై విలసిల్లు చెల్మి సం
పదకు జయాంక మీకృతిసమర్పణ మెల్ల విధంబులన్ దద
భ్యుదయకరమ్ము గా వెలయనోపుత శ్రీపతి శాశ్వతంబుగాన్



## — పాత్రములు —



| | | |
|---|---|---|
| | ధర్మపాలుఁడు | — రాజు |
| | యువరాజు | — ధర్మపాలుని కుమారుఁడు |
| | మంత్రి | |
| | వీరసింహుఁడు | — సేనాధిపతి |
| | భీమసింగ్ | — సహాయ సేనాధిపతి |
| | రణసింగ్ | — ప్రముఖ దండనాథుఁడు |
| | జయసింగ్ | — భీమసింగ్ కుమారుఁడు |
| | కుమార్ | — వీరసింహుని అంగరక్షకుఁడు |
| | రాజసభ్యుఁడు | |
| 1. | దండనాథుఁడు | |
| 2 | దండనాథుఁడు | |
| | వృద్ధుఁడు | |
| | యువకుఁడు | |
| | వైద్యుఁడు | |
| | హంతకుఁడు | |
| | ద్వారపాలకుఁడు | |
| | భటులు | |
| | ప్రమీల | — వీరసింహుని భార్య |
| | రోహిణి | — పరిచారిక |

# రాజ్యకాంక్ష

## 1వ రంగము

[యుద్ధరంగమున సేనాధిపతి శిబిరప్రాంగణము. రాత్రి రెండు గంటల మీఁదట - ప్రవేశము భీమసింగ్, రణసింగ్]

భీమ : రణసింగ్, మనజీవితశేషము ఒక్కదినములో చిక్కినట్లున్నది. ఎటుచూచినను, ఎంత ఆలోచించినను, కాంతిరేఖలేని కారుమొయిలువలె, అపజయమే స్ఫురించుచున్నది.

రణ : అపజయమా?- పరాజయమునకుముందు, మరణమే మనల నాహ్వానింపఁగలదు. ఆవల జయాపజయములు మనల బంధింపఁజాలవు.

భీమ : వీరుఁడవు! నీ వయస్సులో నేనును అట్లే తలంచుచుంటిని. కాని జయాపజయములు మనకు మాత్రము సంబంధించినవా? కావు. మనగెలుపు మహారాజు ధర్మపాలుని విజయము. మనయోటమి రాజ్య ప్రజాపతనము. మన ప్రాణము లొకలెక్కలోనివికావు. ఈ యుద్ధ ఫలితముగా దేశపరిస్థితు లెట్లుమాఱిపోవునోయని ఆందోళనముగా నున్నది.

రణ. మీరు నిరుత్సాహపడినచో సామాన్యయోధులము మేమేమి చేయఁగలము?

భీమ : నిరుత్సాహపడుటకాదు. యధార్థస్థితి తెలిసికొని వర్తించుటయే మన కర్తవ్యము. సేనాధిపతి వీరసింహుఁడును నేనును ఎన్నియుద్ధరంగములలో ప్రాణము లఱచేత నుంచుకొని పోరాడితిమో నీకు తెలియదు. ఇట్టి విషమ సమస్య మమ్మెప్పుడును ఎదుర్కొని యుండలేదు.

(మూఁడుగంటలు విన్పించును)

రణ : అప్పుడే మూఁడుగంటలైనది.

భీమ : రమ్ము, మిగిలిన రెండుగంటలే మనకు విశ్రాంతి.

రణ : ఈ లోపల సేనాధిపతి యేమి నిర్ణయింపఁగలఁడో!

(నిష్క్రమింతురు)

[తెరయెత్తఁగా సేనాధిపతి వీరసింహుని శిబిరము. వీరసింహుఁడు నిద్రించుచుండును. ఒక్కక్షణమైనపిదప కలవరముగా మేల్కొని]

వీర . నేను మహారాజునైతినిగదా...నాశిరస్సున రత్నకిరీట మేది? (పరికించి) ఇది రాజసభ కాదు-ఇది నాశిబిరము... ఏమి యీ విచిత్రస్వప్నము! ప్రత్యక్ష సత్యమువలె దృష్టిగోచరమగుచున్నది!! రేపు జరుగనున్న యుద్ధములోని యవనవాహినీవ్యూహ మంతయును నాయెదుట సాక్షాత్కరించినది.

ఇది నిజమగునా? ఎందుల కీయపూర్వమానసిక సంరం

భము?.. స్వప్నముల కేమి?...తీవ్రమైన ఆలోచనలో మునిఁగి యున్న వారి కివి సహజము... వీనిలో యధార్థమున్న దనుట గాలిని కంటితో చూచితినని చెప్పుటయే.

('స్వప్నము సత్యము' — 'స్వప్నము సత్యము' అను భూత వాక్కు వినఁబడును). .

ఎవరి దాయమానుషమగు కంఠస్వరము? 'స్వప్నము సత్యము' అనిపలుకుచున్నది ఎవరక్కడ?...

(ప్రవేశము భటుఁడు)

ద్వారమునొద్ద నెవ్వరైన నున్నారా?

భటు: ప్రభూ, ఎవ్వరును లేరు.

వీర: నీవేమైన మాటాడితివా?

భటు: లేదు.

వీర: నీవు పొమ్ము. (భటుఁడు పోవును. శబ్దము) ఎక్కడిదా శబ్దము? మేఘగర్జనమా? (ఆకాశమువైపు చూచి) కాదు. నక్షత్రములు మిణుమిట్లు గొలుపుచున్నవి. (గాలిలో తేలియాడుచున్న అమానుషరూప మొకటి వీరసింహునికి కనిపించును) .. .. ఎక్కడిదా వికృతాకారము? భూమ్యంతరిక్షములమధ్య కారుమబ్బువలె కదలివచ్చుచున్నది. .గబ్బిలమువలె ఱెక్కలాడించుచున్నది...

స్త్రీరూపము - కాదు - పురుష రూపమును కాదు- ..నీవె వరవు? ఈ నిశాగర్భమున నాశిబిరము నేల ప్రవేశించి తివి? వాయుమార్గమున సంచరించు పిశాచమవా? మానవగ్రాహ్యమగు వాక్కు నీనోట నెట్లు వెలువడి నది? పలుకుము.

భూతవాక్కు: 'స్వప్నము సత్యము.'

వీర: మహారాజు ధర్మపాలుఁడు బ్రతికియేయున్నాఁడు కదా- నే నెట్లు మహారాజును కాఁగలను?

భూతవాక్కు. 'మరల రాజభవనములో నీ కగపడెదను.'

వీర: మరల రాజభవనములో నాకగపడెదవా? నీ అపవిత్ర రూపమును భూగర్భముననో సముద్రాంతరాళముననో నశింపఁజేసికొనుము - లేనిచో నాకరవాలమున ఖండించెదను.

(కత్తిని సరుసు - భూత మదృశ్యమౌను)

ఆ రూపముగాలిలో కలసిపోయినది. ఇది యంతయు నేదో యింద్రజాలమునలె నున్నది. ... ఐనను ఇందలి సత్యాసత్యములను పరీక్షించెదఁగాక. ఎవరక్కడ?

(ప్రవేశము భటుఁడు)

సర్దార్ భీమసింగును తక్షణమే నా శిబిరమునకు పిలుచుకొనిరమ్ము. (భటుఁడు పోవును ఆలోచనలో)
ఈ స్వప్నము సత్యమే యగునని తోఁచుచున్నది.

రేపటి యుద్ధమున నా సైన్యములను ఈ విధముగనే నడిపిచూచెదను . జయముకలిగినచో . . స్వప్న మంతయు యధార్థమే కావలయును. కాకపోయినచో చింతలేదు. రణరంగమున ప్రాణములర్పించెదను - ధర్మపాలుని ఋణము తీర్చుకొనియెదను.

(ప్రవేశము భీమసింగ్)

భీమసింగ్ ! నిద్రాభంగము కలిగించి నందులకు క్షమింపుము. చీకటిలో నీముసుగు భయంకరముగా నున్నది. తీసివేయుము.

భీమ : తత్క్షణమే రమ్మని ఆజ్ఞపంపించితిరి. వేషము మార్చుట కైనను వీలులేకపోయినది.

వీర : ఇందెవ్వరునులేరు. అత్యవసరమగు కార్యమాలోచించుటకు నిన్ను రావించితిని. రాత్రి యింకెంత మిగిలి యున్నది?

భీమ : సుమారు రెండు గంటలకాల ముండవచ్చును. అచ్చటచ్చట రగిల్చినమంట లారిపోయి నివురుగప్పె యున్నవి. గాయపడిన సైనికులిప్పుడిప్పుడే మూల్గులు మాని యించుక నిద్రాసుఖము చవిచూచు చున్నారు.

వీర : మరణించిన వారి బాధకంటె ఈ క్షతగాత్రుల బాధ హృదయభేదకముగా నున్నది.

భీమ : ఇంతకుముందొక గంటకాలము వఱకును మేమిచ్చటనే యుంటిమికదా, ఇంతలో నేమి జరిగినది ?

వీర . ఇంద్రజాలము.

భీమ : ఏమి ?

వీర : శత్రువ్యూహములు నా కెఱుకపడినవి. రేపు మనము జయించియే తీరుదుము.

భీమ : గూఢచారుల సందేశమా ?

వీర : కాదు. అలౌకికదృశ్యము.

భీమ : అలౌకికదృశ్యమా? నాయూహకందుటలేదు.

వీర : స్వప్నసాక్షాత్కారము .. కంటితో చూచినదానికంటెను విస్పష్టముగానుండినది. యుద్ధరంగ మంతయు ప్రభాతకాంతులతో నిండిపోయినది. శత్రుసైన్యవిన్యాసములు చిత్రములోనిరేఖలవలె స్పష్టముగా కాన్పించినవి.

భీమ : తర్వాత -

వీర : నేను మహారాజు ..... (అర్థోక్తిలో నాపి) తర్వాత విషయము ప్రస్తుతమున కసంగతము.

భీమ : ఇందాశ్చర్యమేమియు లేదు. నిరంతర సంగ్రామ కేళీవినోదులకు ఇట్టి స్వప్నము లగపడుచుండుట సహజము.

వీర : నేనును అట్లే తలంచితిని. కాని 'స్వప్నము సత్యము' అని యొకవాక్కు వినవచ్చినది. తలయెత్తి చూడఁగా నేదియో వికృతాకారమొకటి నాయెదుట నిలిచినది. దానికన్నులు చీఁకటిరాత్రి నల్లనిసముద్రములో ప్రతిఫలించు నక్షత్రములవలె మెఱయుచుండినవి. కారుమబ్బులతో నేసిన వస్త్రమొకటి దాని శరీరమును కప్పియుండెను.

భీమ : అద్భుతము! మీరుదానితో ప్రసంగించితిరా ?

వీర : మానవులతో భూతములు సంభాషింపవు కాఁబోలు. నాప్రశ్న నిరుత్తర మగుటచే కత్తిదూసి ఆవింతవ్యక్తిపై విసరితిని. అంతలో నది మాయ మైనది.

భీమ : ఇది యంతయు మిక్కిలి నిగూఢముగానున్నది. భూగర్భమున నే యంధకార కారాగారమునుండి తప్పించుకొని వచ్చినదో ఆవికృతప్రాణి!

వీర : మానవ మనోఽతీతమగు భవిష్యద్దర్శనము భూతములకు కలదని తలంచెదను.

భీమ : ఉండవచ్చును - లేకపోవచ్చును. దానితో మనకు పని యేమి !

వీర : నేఁటి యుద్ధమున మనసైన్యములను నడిపించుట నా స్వప్నముపై నాధారపడియుండును.

భీమ : స్వప్నములపై నాధారపడి యుద్ధము చేయుదురా ?

వీర : స్వప్నములు ప్రయత్నసాధ్యములు కావు. దైవికములు. పౌరుషము వ్యర్థమగుచున్నపుడు దైవము నాశ్రయింపక తప్పదు.

భీమ : ఐన మీ యభిప్రాయమేమి ?

వీర : వారు ముఖ్యసైన్యదళములను కొన్నింటిని రహస్యముగా వాయవ్యముఖముగను, మఱికొన్నింటిని ఈశాన్యముఖముగను మనవెనుకకు తెచ్చునట్లు గోచరించినది. అది యించుమించుగా రెండుమైళ్ల దూరమున జరుగుచుండవచ్చును. అవిరెండును మనవెనుక సంధిల్లినచో మన వినాశముతప్పదు.

భీమ . కావున ?

వీర : కొన్నిసైన్యదళములతో నీవు వాయవ్యముఖమున వారి నరికట్టవలయును. మఱికొంత సేనతో రణసింగ్ ఈశాన్యమున వారిని ప్రతిరోధించును.

భీమ . ఇది యథార్థము కానిచో ?

వీర : ఎట్లును వినాశము తప్పదు.

భీమ . అట్లని స్వప్నములమీఁద నాధారపడి వర్తించుటయా? జయముఁకలుగనిచో ఇదియంతయును మతిభ్రమణమని పరిహసింపరా ?

వీర : ఏమి - నాకు మతిభ్రమణమా? హిమాలయ శిఖరములు కదలిపోవలయును — భీమసింగ్ ! నే నాలోచింపకయే యీనిర్ణయమునకు వచ్చినవాఁడనుకాను. ఇంతవఱకు మనము పన్నినవ్యూహములు నిరర్థకములైనవి. శత్రు సేనలు విజృంభించియున్నవి. మనవారు నిరుత్సాహ పడుచున్నారు. నేను చేయఁగలదేమియు నా కగపడుట లేదు. ఇది నా కడపటి యుద్ధ మేమో!!

భీమ సేనాధిపతియాజ్ఞ. కాని యీయమానుషరూపములు అల్పములయందు నమ్మకము పుట్టించి మహాకార్యముల యందు మానవులను వంచింపఁగలవు.

వీర : విధివంచితుఁడుకాని మానవుఁడు లేఁడు.

[గూఢచారులిద్దఱు యవనులవలె మాఱువేషముతో త్వరితులై ప్రవేశింతురు]

భీమ : (వారినిగుర్తింపక కత్తిమీఁద చేయిపెట్టి) ఎవరుమీరు?

వీర · భీమసింగ్ ! (చేతితో వారించి గూఢచారులనుచూచి) ఏమి వార్త?

1. చారు . మాయత్నము సఫలమైనది. (దాఁచియుంచిన కాగితమును వీరసింహుని కందించును)

వీర : (ఆతురతతో దానిని పరీక్షించి) ప్రత్యక్షగమును నా స్వప్న చిత్రము! భీమసింగ్, చూడుము. (గూఢచారులతో) వేల కొలఁది ప్రాణములు మీ వార్తపై నాధారపడియున్నవి.

2. చారు : ప్రభూ, ఈవార్త యవనసేనాని శిబిరములోనుండి తెచ్చితిమి.

వీర . మీసాహసమును మఱచిపోము.

(చారులు పోవుదురు)

భీమ : వారి మాఱువేషములు నన్నును మోసపుచ్చినవి.

వీర : ప్రజ్ఞావంతులు — ఈయద్భుతములనుగూర్చి వేఱొక తరుణమున. నీవుపోయి సకలదండనాథులను కార్యస్థానమున సమావేశపఱపుము. నే నిప్పుడే వచ్చెదను. కాల మమూల్యము. రాత్రి తెర వ్రీలకమునుపె మన సైన్యము యుద్ధసన్నద్ధము కావలయును.

భీమ : ఆజ్ఞ. (నిష్క్రమించును)

వీర : విధి నాజీవితముతో జూదమాడు చున్నట్లున్నది! కానిమ్ము. జరుగవలసినది జరుగకమానదు.

[ తెర ]

# రాజ్యకాంక్ష

## 2వ రంగము

[ధర్మపాలుని సభాస్థానము ధర్మపాలుఁడు, మంత్రి, ఇతర రాష్ట్రాధికారులు ఆసీనులై యుందురు.]

ధర్మ: యుద్ధరంగమునుండి మరల నేదైన వార్త వచ్చినదా?

మంత్రి: ప్రభూ! ఏమియును రాలేదు.

ధర్మ: పరిస్థితులు విషమించి యున్నపుడు ఎట్టి వార్తలు లేకుండుటయే మేలనిపించుచున్నది. దేశములోని కట్ట కడపటి సైన్యదళమును యుద్ధమునకుఁబంపఁబడినదికదా?

మంత్రి: చిత్తము.

ధర్మ: ఎంత జననష్టము - ఎంత రక్తపాతము! మానవ కంకాళముల పునాదుల మీఁద మహా రాజ్యములు నిర్మింపఁబడుచున్నవి. ఈ రాజ్యతృష్ణాపిశాచము కబళించిన ప్రాణములు అసంఖ్యాకములు. ఎందఱు తల్లిదండ్రులు పుత్రశోకమున తల్లడిల్లిపోవుదురో - ఎందఱు యువతులు భర్తృవియోగమున తపించిపోవుదురో - ఎందఱు సౌందర్యమూర్తులు వికలాంగులై యావజ్జీవము నరకబాధననుభవింతురో! 'రాజ్యాంతే నరకం ధ్రువ' మ్మనుట ముమ్మాటికి సత్యము.

మంత్రి : మహారాజా! మీరొనర్చునది ధర్మయుద్ధము. దీనిక మూలకారణము యవన దౌర్జన్యము. దాని నణచి వేయుటకు మీరు చేయు ప్రతిఘటన ధర్మకార్యమగును గాని అన్యథా కానేరదు. క్షత్రియులకు ధర్మయుద్ధము కంటె శ్రేయస్కరమైనది మఱియొకటి లేదనికదా భగవత్ ప్రబోధము.

ధర్మ : నిజము - ఐనను ఈనాఁడిట్లు హృదయము వికలమగుచున్న దేమి? శత్రుసైన్యములసంఖ్య మిక్కుటముగా నున్నదని రహస్యవార్త వినియుంటిమి. యుద్ధపరిణామము కేవలము సేనాధిపతి సంగ్రామనైపుణ్యము మీఁద నాధారపడియున్నది. రాజ్యమున కేమి గతి పట్టనున్నదో!

మంత్రి. ఇంతకంటెను ఘోరవిప్లవములందు ధైర్యమునువీడని మీరు నేఁడేల అమంగళమును శంకించుచున్నారు? వీరసింహుని శౌర్యము అప్రతిమానము.

ధర్మ. శక్తికి మించిన అతఁడేమిచేయఁగలఁడు?

మంత్రి : శక్తికి మించిన యుక్తియు నాతనియెడ కలదు.

(ప్రవేశము ద్వారపాలుఁడు)

ద్వార : ప్రభూ! యుద్ధరంగమునుండి రణసింగ్ వచ్చి యున్నారు.

(ప్రవేశము రణసింగ్ రక్తసిక్తవస్త్రములతో)

రణ: జయము మహారాజునకు.

ధర్మ: వీరసింహునికి కుశలమా - యుద్ధఫలితమేమైనది?

రణ: విజయము సిద్ధించినది. సేనాని కుశలముగా నున్నారు.

ధర్మ: అంధకారములోనికి దీపకళికవలె తెచ్చితివి నీసందేశ మును. అమృతపాన మొనర్చినట్లున్నది. రణసింగ్, వాఙ్మాత్రాభినందనములతో నిన్ను సత్కరించుటకు హృదయము సమ్మతించుటలేదు.

రణ: మహారాజా! ధర్మమూర్తులగు మిమ్ము స్మరించుచునే యుద్ధముచేసితిమి. వెనుకటి పోరాటము లొకలెక్కలో నివి కావు. నేటి సంగ్రామము అద్భుతమైనది. ప్రాతః కాలమువఱకును నిరాశచెంది అందఱమును సంగరాగ్ని కాహుతీయగుటకు సంసిద్ధులమై యుంటిమి. కాని, సేనాపతి యపూర్వసాహసముతో కల్పించిన నూతన సైనిక వ్యూహము శత్రువులను భయభ్రాంతులను గావించినది. కొన్నిదినములు జరుగవలసినయుద్ధము దినార్థములో విజయవంతముగా ముగిసినది. గాయ పడినవారిసంఖ్య అల్పము. మరణించినవారిసంఖ్య అల్పతరము. సేనాధిపతి తన విజయమునకు తానే ఆశ్చర్యపడుచున్నారు.

ధర్మ: రణసింగ్, దేశమునకు ప్రాణప్రదమగు వార్త తెచ్చితివి. ఇది సంతోషమునకు సమయము. ఈ రక్తసిక్త వస్త్రములను తీసివేసి నూతన వస్త్రములను ధరింపుము.

(రణసింగ్ నిష్క్రమించును ప్రవేశము ద్వారపాలకుఁడు)

ద్వార: ప్రభూ! సేనాధిపతి వచ్చియున్నారు.

ధర్మ: మనము స్వయముగా స్వాగతమొసంగెదము. (దిగివచ్చి ద్వారమునొద్దకు పోవుదురు ప్రవేశము వీరసింహుఁడు, భీమసింగ్, జయసింగ్, పరివారము)

వీర. మహారాజా! వీరసింహుఁడు నమస్కరించు చున్నాఁడు

ధర్మ: సేనాధిపతీ! సార్థక నామధేయుఁడవైతివి. హైందవ తేజోవికాసముచే చంద్రవంక కళమాసినది. దేశక్షేమమునకు నీవొనర్చిన మహోపకారము చిరస్మరణీయము.

వీర. మహారాజా! నేను చేసినదేమున్నది. నాధర్మము నేను నిర్వహించితిని. నాశక్తిసామర్థ్యములకంటెను దైవబలమే విజయమునకు మూలకారణము.

ధర్మ: ఉత్తమవంశజుఁడవగు నీకీ వినయ మలంకారమగు చున్నది.

మంత్రి. నీ ప్రభుభక్తి మాకెల్లరకును ఆదర్శముకాఁగలదు.

ధర్మ: ఈ పుష్పమాలలెక్కడివి - దేవతలు పుష్పవర్షము కురియించిరికాఁబోలు, యవనరాక్షసులను నుఱుమాడినందులకు సంతసించి!

వీర : మానవులు దేవతలైనచో మీ రన్నది సత్యమే యగును. నేను అశ్వారూఢుఁడనై వచ్చుచుండఁగా నగరమార్గములందు పౌరులు నాకీ పుష్పమాల లొసంగిరి. వారి ఆదరణచిహ్నములైన యివి సర్వథా అలంకరణయోగ్యములని కొనితెచ్చితిని.

ధర్మ : వీరపూజ కింతకన్న ఉత్కృష్టసమయ మున్నదా ? దీనిని ధరింపుము.

(మణిహారముతో నలంకరించును)

వీర : మీ యౌదార్య కలశార్ణవమున కణమాత్రుఁడ నగుచున్నాను.

ధర్మ : ఆసనము లలంకరింపుఁడు.

(అందఱు ఆసీనులగుదురు)

ఈ నిమిషము నాయంతరాత్మ ఆనందతన్మయత్వము చెందినది. రాజభక్తిపరాయణులైన మీయందఱి ఐకమత్యబలమే నా రాజ్యమునకు వజ్రకవచము. ఇట్టి శుభసమయము నా జన్మమం దింక రాదనిఁ తోఁచుచున్నది. నిరంతర రాజ్యపాలనాభారముచే క్రుంగిపోవుచున్న నా మనశ్శరీరములకు విశ్రాంతినీయఁదలఁచితిని. కావున ఈ కల్యాణపరంపరలకు శుభావసానముగా రేపే నా కుమారునికి పట్టాభిషేక మొనరింపఁదలఁచితిని. వీరసింహా ! నా కుమారునికి కుడిభుజమవై రాజ్యము సంరక్షింపవలసిన భారము నీది.

వీర : ... ప్రజారక్షణకై ప్రాణములర్పించుటకు వెనుదీయను.

ధర్మ : నీ దేశభక్తి ప్రశంసార్హము. మంత్రీ! ఈ శుభవార్త ప్రజలకెఱింగించి పట్టణ మలంకరింప నాజ్ఞాపింపుము. నేఁటి రాత్రి మనమెల్లరము వీరసింహుని గృహముననే విందారగించెదము.

వీర : అనుగృహీతుఁడను. సభ్యులెల్లరు విందునకు నాహూతులు. మహారాజా! మీ యాగమనవార్త విని ప్రమీల మిక్కిలి సంతోషింపఁగలదు. నేను పోయి అతిథిసత్కారమున కాయత్తపఱచెదను.

ధర్మ : అట్లే కానిమ్ము. ప్రమీలాదేవికి మా యభినందనములు.

(వీరసింహుఁడు నిష్క్రమించును)

నేఁటికి సభ చాలింతుము.

(అందఱు నిష్క్రమింతురు వేఱొక ప్రక్కనుండి వీరసింహుఁడు ప్రవేశము)

వీర : ఏమి ఈ విచిత్రసంఘటనము... యువరాజ పట్టాభిషేకము రేపే జరుగవలయునా? .. భూతవాక్కులు బూటకపుమాటలే కాఁబోలు! . యశఃప్రభాద్యోతకమగు మధురస్వప్నము తటాలున భగ్నమై పోయినది. ఆశాజ్యోతి నిరాశారాహుగ్రస్తమైనది.



‘ఫిటిసింగా’ పాత్రము ధరించిన

శ్రీ నాడేపల్లి రామయ్య

అట్టైన స్వప్న మింతవఱకును యథార్థమే ల
కావలయును!... పురుషప్రయత్నములేక కిరీటములు
తమంతటవచ్చి శిరస్సులపై నిలుచునా? ... ...
రేపు పట్టాభిషేకము కారాదు.... ఏమితలపెట్టినను
ఈ రాత్రియే జరుగవలయును .. .. ...మహారాజు
మా దుర్గముననే నిద్రించునుకదా! కాలగర్భమున
నెట్టి విపరీతసంఘటన లడఁగియున్నవో.........
సంధ్యాకాలమా! నీ శోణదీధితుల నుపసంహరింపుము.
నా హృదయగోళమున సంక్షోభించుభావములు దివాం
ధములట్లు సూర్యకాంతికివెఱచి బహిర్గతములు కాఁజాల
కున్నవి....

[ తెర ]

# రాజ్యాకాంక్ష

## ౩ వ రంగము

[మణిదుర్గమున అంతఃపురము – ప్రవేశము
వీరసింహుని భార్య ప్రమీల]

ప్రమీ   రోహిణీ   రోహిణీ

(పరిచారిక రోహిణి ప్రవేశించి)

రోహి : అమ్మా!

ప్రమీ : ఆ గానము నాపివేయుమని చెప్పుము. నాకు సహింప రాకున్నది.

రోహి : మీరు వేటకు వెళ్ళొచ్చి అలసిపోయి వుంటారు కొంత విశ్రాంతిగా వుంటుందనుకున్నాను.

ప్రమీ : విశ్రాంతి – ఈ ప్రాణికి విశ్రాంతి ఈ జన్మలో లేదు.

(రోహిణిపోవును ప్రవేశము భటుడు)

భటు . సేనాపతి యీ జాబును స్వయంగా మీ చేతి కివ్వమని పంపారు.

ప్రమీ : (జాబుతీసికొని కొంతభాగము తనలో చదువుకొని, భటునితో) మీ సేనాధిపతికి అపజయమెన్నడును లేదు . .. విజయ వార్తలు మాకు అలవాటుపడిపోయినవి.

(భటుఁడు పోవును తర్వాత భాగము
బహిరంగముగా చదువును)

"స్వప్నము సత్యము అని భూతవాక్కు వినవచ్చినది. దానిని నేను నమ్మలేదు. సంక్షుబ్ధమైన సుషుప్తి యందు శబ్దము లప్పుడప్పుడు వినవచ్చుచునేయుండును. కాని తర్వాత నొక త్రుటిలో భయంకరాకారముగల భూతమొకటి నాయెదుట ప్రత్యక్షమైనది. ఈ విషయ మింకను తఱచియడుగవలెనని ఆ వికృతరూపమును నేను ప్రశ్నించితిని. ప్రత్యుత్తర మొసంగకయే అది గాలిలో నంతరించినది. యశోభాగిని! హృదయేశ్వరివగు నీకీ వృత్తాంతము ముందుగా తెలియఁబఱచితిని. నీకు రాఁగల అభ్యుదయమును తలపోసి, మున్ముందు మన మధిరోహింపఁగల సముజ్జ్వల స్వర్ణశృంగమును నిపుణముగా నూహించుకొని యానందింపుము. ఈవిషయ మును హృదయములోని రహః ప్రదేశమున దాఁచి యుంచుము — నీ - వీరసింహుఁడు".

(జాబులోని కడపటి వాక్యములను ఒకటిరెండు మార్లు
ఆలోచించుచు చదువును)

ఇట్టివిషయమును హృదయములో దాఁచియుంచుట అగ్నికణములను మూటకట్టుటవంటిది. హృదయమును దహించివేయును. ప్రియతమా! నీకీర్తి దిగంతములకు వ్యాపించినది. హైందవ వీరపురుషులకు శిరోభూషణ

మైతివి. మహారాజ్యము నేలుటకు నీకన్న అర్హులెవరు? విధిబలమును మనప్రక్కనేయున్నది. .. ... కాని దయామయమగు నా మనోహరుని హృదయము ఈ దారుణక్రియకు సమ్మతించునా? ఉత్తమమార్గాచరణ శీలమగు ఆతని బుద్ధి యీ కుతంత్రమున కంగీకరించునా? . .. ఐననేమి? ఈ రాజ్యతృష్ణాగ్నికణము లాతనియంతరంగమున లేకపోయినవా? నా వచః ప్రచండానిలముచే నవి దావవహ్నిగా విజృంభించి ధర్మాధర్మవిచక్షణతను దగ్ధమొనరింపఁగలవు ......

(ప్రవేశము రోహిణి)

రోహి : దేవీ! మహారాజు ఈ రాత్రి యిక్కడికి వస్తారట.

ప్రమీ . నీకు మతిపోయినదా? మహారాజు ఇక్కడికి వచ్చుటేమి?

రోహి : రాజభవనంనుండి సేనాని పంపినవార్తయిది.

ప్రమీ : తెచ్చిన దెవరు?

రోహి : యుద్ధభటుఁడు.

ప్రమీ : ఇచ్చటికి రమ్మనుము.

(రోహిణి పోవును)

విధి అనుకూలమైనపుడు కార్యములు తమంతట తామే పొసఁగివచ్చుచుండును.

(ప్రవేశము భటుఁడు, రోహిణి)

ఏమి నీవార్త?

భటు: మహారాజు మణిదుర్గానికి వస్తున్నారని సేనాని వార్త పంపించారు.

ప్రమీ: సేనాపతిని చూచివచ్చితివా?

భటు. వారే స్వయంగా వార్తపంపింది. ఎక్కడా నిలవకుండా పోయి వార్త మీ కందివ్వమని ఆజ్ఞాపించారు. రాజ భవనంనుండి వొక్క పరుగులో వచ్చాను. గుఱ్ఱానికి నీళ్లైనా పెట్టలేదు.

ప్రమీ: అమోఘమగువార్త! రోహిణీ! అలసిపోయిన యీ తనికి తగినపరిచర్యలేర్పాటుచేసి నా జవనాశ్వమును కానుకగానిచ్చి పంపుము.

(భటుఁడు, రోహిణి పోవుదురు)

మహారాజు నాగమనము అనుకూలవిధికి ప్రత్యక్ష నిదర్శనము. అప్పుడేచీఁకటులు బలసినవి. గాలిబిగిసి యున్నది. మేఘములు క్రమ్ముకొన్నవి. ఝుంఝామారు తము వీచుటకు మొదటిచిహ్నము. ఈ నిశ్శబ్దతలో నెంతసంక్షోభ మడఁగియున్నది. కార్యాచరణము నకు అనుకూలవాతావరణము. హృదయమా! రెండు గడియలకాలము స్త్రీసహజప్రకృతిని దూరముచేయుము. భూతదయను లోనికి రానీయకి అడ్డగింపుము!

(మహారాజురాకను సూచించు తూర్యధ్వనులు)

మహారాజును మాదుర్గమునకుఁ గొనితెచ్చు ఆ తూర్యధ్వని కాకోల కంఠరవముకంటెను నిష్ఠురముగా నున్నది... రోహిణీ.

(ప్రవేశము రోహిణి)

సేవకులను వారివారి స్థానములలో నుండుఁడని చెప్పుము. ఇతర కార్యములు నేను సరిచూచెదను.

(రోహిణి పోవును)

స్త్రీత్వమా! ననువీడిపొమ్ము. . . క్రౌర్యమా! నఖశిఖాపర్యంతము సన్నావహింపుము.

(ప్రవేశము వీరసింహుఁడు)

వీర: (స్వగతము) మకుటధారణము సింహాసనాధిరోహణము ...నిరంకుశ మహారాజ్యాధిపత్యము ...

ప్రమీ: ప్రియతమా!

వీర: ప్రమీలా!

ప్రమీ: మీలేఖలు కాలపుఁదెరను తొలఁగించినవి.

వీర. (మౌనము)

ప్రమీ: అంనవర్తమానమునుదాఁటి మహోజ్జ్వల భవిష్యద్వళోవీథులకుఁ గొనిపోయినవి.

వీర : మహారాజు మనదుర్గమునకు వచ్చియున్నారు. అతిథి సత్కారమునకు ప్రయత్నము చేయవలయునుగదా.

ప్రమీ. అంతయు సంసిద్ధము చేసెదను. మఱి యిచ్చటనుండి యెప్పుడు పోఁగలఁడు?

వీర. రేపు ఉదయమున.

ప్రమీ: ఆ ప్రాతఃకాలమునకు సూర్యోదయములేదు. ఆ రేపు కాలసాగరములో కలిసిపోయినది.

వీర : ప్రమీలా! నీమాటలు నాకర్థము కాలేదు.

ప్రమీ : మీ హృదయము నాకర్థమైనది!

వీర. నాకేమియు తోఁచుటలేదు. కలవరముగానున్నది.

ప్రమీ. ఒక్కరాత్రి మనసైన్యమును చిక్కఁబట్టుము. ఆవల నీవు మహారాజువు నేను పట్టమహిషిని. ప్రత్యక్షమగుచున్న సత్యమును సంశయించు టెందులకు? ఈ రాత్రి జరుగవలసిన నాటకమునకు నేను సూత్రధారిణి నయ్యెదను. మహారాజు నిద్రించుటకు ప్రత్యేకమందిరము నేర్పాటుచేసెదను. రక్షకభటులను సురాపానముతో ఉన్మత్తులను చేయించెదను. వారు మరణించినవారివలె మైమఱపులోనుండఁగా ఈ కార్యమున కెవ్వ రడ్డురాఁగలరు?

(ప్రమీల నిష్క్రమించును)

వీర. దుర్విధీ! ఎంతటిఘోరకృత్యము! ఇంతవఱకును నా రాజభక్తిని ప్రజలు ఆబాలగోపాలము ప్రశంసించుచుండిరి కదా! యుద్ధరంగమున శత్రువీరుల మస్తకములతో కందుకక్రీడసలిపిన ఈ హస్తము నిద్రించు మహారాజు కంఠమునే త్రెంపవలయునా? నూతనవధువువలె నన్నాశ్రయించిన కీర్తికన్యక మంగళాంగమును రుధిరస్నాన మాడింపఁజాలను ... మహారాజు నాకేమి యపకారముఁ గావించెను? నిండుసభలో నాకంఠమును మణిహారముతో నలంకరించిన యుదారహృదయుఁడే . ఆతనిమెడలో కృతఘ్నుఁడనై కత్తి చొనుపుటయా? వలదు, రాజ్యము వలదు, కిరీటము వలదు. . మీఁదు మిక్కిలి ఆతఁడు మాగృహమున కతిథిగా వచ్చియుండ లేదా? ... అతనిపై కత్తిదూయువారిని శిక్షించుటకు మాఱు నేనే ఆతనివధ కుద్యమించుటయా? ... ఎట్టి విచిత్రమైన అతిధిసత్కారము! మహావీరుఁడగు వీరసింహుఁడు నీచమైన రహస్యవధకు పాల్పడెనని చరిత్రలో నాపేరు రక్తముతో వ్రాయఁబడదా! ఈయపకీర్తి దుర్భరము!

(ప్రవేశము - ధర్మపాలుఁడు, భీమసింగ్, రణసింగ్ ఇతరులు)

మహారాజా! స్వాగతము.

ధర్మ. మీ మణిదుర్గము ఏకాంతమై విశ్రాంతిమందిరమువలె

నన్నది. ఇట్టి ప్రశాంతి రాజభవనములో నే ననుభవించియుండలేదు.

భీమ : ప్రభూ, నగరమధ్యముననున్నది మీ రాజభవనము. పట్టణ శబ్దములు అనుక్షణమును ప్రతిధ్వనించుచునే యుండును.

వీర : మహారాజా! శ్రవణకఠోరమైన యుద్ధకోలాహలముచే గాసి చెందియున్న మాకు ఈ నిశ్శబ్దత మిక్కిలి అనుభోగ్యముకదా.

ధర్మ : నిజము, కష్టనివారణమే సుఖము. సుఖవియోగమే కష్టము. రెండును పరస్పర సాపేక్షములు ..రణసింగ్, మన ఆకస్మికాగమనము వీరసింహునికి శ్రమకలిగించినదేమో!

రణ : అతిథిసత్కారము ఆతనికి వంశానుగతమైన సుగుణము. వీరసింహుని ఆతిథ్యమును చవిచూచి సంతోషింపని మిత్రు లెవ్వరునులేరు.

(ప్రవేశము ప్రమీల)

వీర : ప్రమీలా! మహారాజు. . .

ప్రమీ . (నమస్కరించి) స్వాగతము మహారాజునకు.

ధర్మ : యుద్ధవిజయము సాధించి వీరసింహుఁడు దేశమునకు చేసిన మహోపకారమునకు మేము ఋణపడియున్నారము. ఆ ఋణము తీర్చుకొనుటకే యిచ్చటికి వచ్చితిమి.

ప్రమీ : మీ రాకచే మా మందిరము పావనమైనది. మీ వాత్సల్యముకంటెను మాకుఁగావలసిన దేమున్నది?

ధర్మ : మీ వాజ్మాధుర్యముచేతనే మాకు ఆతిథ్యము లభించినది.

ప్రమీ : నేఁడు మా కిది సుదినము. మహారాజు క్షమింతురుగాక. చిరకాలము పితృవియోగఖిన్నమైన నామనస్సున కాప్యాయనము కలిగించుచున్నది. మాతండ్రిని చూచినట్లే హృదయ మానంద తరంగితమగుచున్నది.

భీమ : మీ రాజభక్తి మిక్కిలి అసాధారణము. మీ పల్లులు మిగులనొప్పియున్నవి. మహారాజును తండ్రిగాభావింపనివారెవ్వరునులేరు.

ధర్మ : భీమసింగ్, అట్లుకాదు. వారి ప్రేమ విశిష్టమైనది.

వీర : మీయౌదార్యమునకు కృతజ్ఞులము.

ధర్మ . నీవు విశ్రమింపుము. భీమసింగ్, రమ్ము దుర్గములోని విశేషములను చూచి వచ్చెదము.

(ఉరుములు మెఱపులు)

భీమ . కారుమొయిళ్లు గర్జించుచున్నవి. కుంభవర్షము కురియునట్లున్నది.

ధర్మ . గర్జించు మేఘములు వర్షింపవు. వర్షించినను మణి దుర్గమును భేదింపఁజాలవు.

(మహారాజు, భీమసింగ్, లక్ష్మసింగ్, ఇతరుల నిష్క్రమింతురు)

వీర : ప్రమీలా! ఈ విషయమింతటితో మఱచి పోవుదము.

ప్రమీ. ఏమి - ఈక్షుద్రహృదయ దౌర్బల్యము?

వీర : చిరకాలమునుండియు ప్రాణములకు తెగించి గడించిన సత్కీర్తిని ఒక్క క్షణములో పోగొట్టుకొనుటకు నా మనస్సు సమ్మతించుటలేదు.

ప్రమీ: అంతటి కీర్తికాముఁడవైనచో ఈ కార్యము చేయుటకు మొదట నీ హృదయమెట్లు సమ్మతించినది? నా పై ప్రేమయు నింతచంచలమే యగునా?

వీర . ప్రమీలా! నాహృదయము నీయధీనములో నున్నది. ఎవరికొఱకు ఈ యశస్సు నీకు తెలియదా? ప్రజలు మహారాజును దేవునివలె పూజించుచున్నారు. అతని అకాల మరణము విప్లవమును రేఁపఁగలదు.

ప్రమీ: ఇట్టి భీరుఁడవని నే నూహింపలేదు. ఆశాసాధనమునందు భగ్నహృదయుఁడవగు నీ పౌరుషము పరిహాసాస్పదము.

వీర : నీ మాటలు చాలింపుము. వీరపురుషోచిత మగు కార్యము సాధించుటకు నాకంటె సమర్థులెవ్వరు?

ప్రమీ. అట్లైన ఈరాజ్య తృష్ణావిషమును నారక్తనాళములలో నేల ప్రవేశ పెట్టితివి? అది నాతలకెక్కినపిదప భీరుని వలె వెనుకంజవేయుట యెట్టి వీర కార్యము?

వీర . మహారాజు పరమధార్మికుఁడు.

ప్రమీ: ధార్మికులకు చావులేదా ? అట్టి నిష్కళంక ధార్మికోత్తముఁడుగా మహారాజు అస్తమించుటయే శ్రేయము. మానవ హృదయములు చంచలములు!

వీర : ఆతని సుగుణములు ఒక్కటొక్కటియు నొక్క దేవతారూపమెత్తి వచ్చి యీ కఠోర హింసాక్రియ వలదు వలదని మనలను వేఁడుకొనుట లేదా?

ప్రమీ: ఈ యపూర్వకల్పనలు మీధార్మికత్వమునకే నిదర్శనములు. సింహాసన మధిష్ఠించిన పిదప ధర్మప్రవర్తకులనుపేరు మీకేల రాకూడదు?

వీర : పాపపుణ్యములులేవా - నరకములేదా?

ప్రమీ: వెఱ్ఱికలలు - పసికూనలను వెఱపించుటకు కల్పించిన కట్టుకథలు.

వీర : నీ హృదయమెంత కర్కశమైనది!

ప్రమీ : ఇది యంతయు మీపైని ప్రేమయని మీకు తెలియదా? ఇంతకాలము మీ సహధర్మచారిణినై యుండిన నా మనస్సు మీ రెఱుఁగరా ?

వీర : .. . కార్యభంగమైనచో .

ప్రమీ : మనము తలపెట్టుటయు - కార్యభంగమగుటయునా? మీ హృదయము మీ యధీనములో నుంచుకొనుఁడు. కార్యభంగ మెన్నఁటికిని కాదు. నా పరిచారిక మిక్కిలి

నై పుణ్యముకలది. రక్షకభటులను మదిరాసరస్సులో ముంచివేయఁగలదు. వారి బాకులనే ఉపయోగింప వలయును. హత్యాకారకులు వారే కావలయును!

వీర : వారిచేతులను ముఖములను నెత్తుటితో తడిపివేసిన ఈ హత్య వారి తలమీదనే పడునుగదా.

ప్రమీ : కాదనుటకెవరికి గుండెకలదు ? ప్రియతమా! ఆవల మీరు మహారాజు. నేను పట్టమహిషిని.

వీర : నీ కోమల హృదయ మింత శిలాకఠినమగుట నాకాశ్చర్య ముగా నున్నది. స్త్రీసంతానమునకు నీ గర్భమున తావులేదు. సంశయమంతరించినది. హ స్తమా ! నీవు నా బానిసవు. నా యాజ్ఞ నిర్వహింపవలయును.

ప్రమీ : కార్యముసాధించు వఱకును మిక్కిలి జాగరూకులమై మెలఁగవలయును సుమా ! ఎవ్వరును అనుమానింపని యట్లు అందఱతో కలిసి మెలిసి స్నేహితునివలె నటింప వలయును. ఏమియు నెఱుఁగని చిన్నిపుష్పమువలె నగపడి, వెనుక దాఁగిన విషసర్పమువలె కాటువేయ వలయును!

వీర : .... ఊ....

[ తెర ]

# రాజ్యకాంక్ష

## 4వ రంగము

[వాణిదుర్గము-రాత్రి-గాలివాన ప్రవేశము భీమసింగ్,
యువరాజు, జయసింగ్]

జయ : ఈ అకాలవర్షమున కింత దౌర్జన్యమెందులకో ?

భీమ : అకాలము గనుకనే యీ దౌర్జన్యము! కాలాను సారముగా పరిపాకమునకు వచ్చు కార్యములకు ఇట్టి సంక్షోభ ముండదు.

జయ : వీరసింహుఁడు తన కార్యక్రమము భగ్నమైనందులకు ఎంత చింతించుచున్నాఁడో!

యువరా: నిజము. మహారాజుపై ఆతని యభిమాన మట్టిది. ఈ లోపముల నన్నింటిని ఆతని నిర్వ్యాజ ప్రేమయే సరిదిద్దునది.

భీమ : తండ్రికి తగిన కుమారుఁడవు! మానవ ప్రకృతి రహస్యములు ఇంకను నీకు కాలక్రమమున తెలియఁ గలవు.

యువరా: ఏమి- వీరసింహుని గూర్చియా ?

భీమ: కాదు-కాదు. జనసామాన్యమును గూర్చి మాటాడు చున్నాను మానవహృదయము అంతు దొరకని యొక మహాసముద్రము. దానిలో మనోహరము లగు ప్రేమ మౌక్తికములున్నవి. ఔదార్య

రత్నములున్నవి. ఆ సముద్రాంతరాళమునసే ఆశాక్రోధాదికములగు నక్రగ్రాహములునుకలవు. అతి రమణీయమైనది, అత్యంత భయంకరమైనది- కుసుమ సుకుమారమైనది, శిలాకఠినమైనది- అమృత మధురమైనది, విషదిగ్ధమైనది- మానవ హృద యము! మీరు పసివారు. మీ హృదయములు నిష్కల్మషములు!

యువరా. ఇట్లుండుటయే మాకు శ్రేయస్కరము కదా!

భీమ: సందేహములేదు. కాని లోక వ్యవహారములు నడి పించునపుడు మానవుల అంత రాంతరములలో నిగూఢముగా మెదలుచున్న వివిధభావములను గుర్తించు నేర్పు మీకు కావలసియున్నది.

(యువరాజు నుద్దేశించి)

నీవు. మహారాజు కాఁబోవుచున్నావు. ఆ రాజపీఠ మధిష్ఠించిన పిదప రహస్యము లింకను నీకు బోధపడఁ గలవు.

(ప్రవేశము వీరసింహుఁడు)

వీర. (స్వ) భయంకర కృత్యమున సంకల్పాచరణముల మధ్య కాలమంతయు నొకయాతనావహమగు స్వప్నము. (ప్రకాశముగా) మిత్రులారా! సుఖమే కదా.

భీమ. కాకేమి -

వీర : కార్యము చక్కఁగా నిర్వహించుటకు కాలము చాలినదికాదు. ఈ ప్రచండ వాతావరణ మిప్పుడే దాపురించినది. అనుకున్న దొకటి, జరుగుచున్నది మఱి యొకటి. మన ప్రయత్నము లెట్లుతుదిముట్టఁగలవో మనకు తెలియదు.

యువరా : మేమును అట్లే తలంచితిమి, వీని కేమి? మీసాహార్ధమే తండ్రిగారికి అనంత సంతోషదాయకమైనది.

వీర : (మౌనము)

భీమ : (వీరసింహుని పరీక్షించుచు) స్వప్నములయందు యథార్థమున్నదని యిప్పుడు గ్రహించితిని. ఆ నాఁడు మీరు వినిపించిన స్వప్న వృత్తాంతము నాకెన్నఁడును మఱపురాదు. దానిని మీరు సంస్మరించుటలేదా ?

వీర : ఆ నాఁటి స్వప్నవృత్తాంతమా - నేనప్పుడే మఱచి పోయితిని. ఈ శుభసమయమునఁ గడచి పోయిన సంగ్రామగాథలను త్రవ్వుటెందుకు ?

భీమ : మహారాజు నిద్రించుటకు పూర్వము మీ బొక్కసమును ధనముతో నింపుమని యాజ్ఞాపించినారు. ప్రమీలా దేవికి రత్నఖచితమైన యీ అంగుళీయకమును కానుకగా నిమ్మని చెప్పిరి. దీనిని తీసికొనుఁడు.

వీర : (సంక్షుబ్ధమైన హృదయము నడఁచికొని) మిత్రమా! మహారాజు నౌదార్యము అపాత్రునియందు వినియోగింపఁబడు

చున్నది. ఆ ధనము రాజ్యములోని బీదసాదల కిచ్చి నచో ఎంతయో పుణ్యకార్యమగును. అమూల్యమైన ఆ యంగుళీయకము మహారాజుచేతినే అలంకరింపవల యును. ప్రమీాల దానిని ధరించుటకు అర్హురాలుకాదు.

యువరా: సేనాపతీ! మహారాజు హృదయ పూర్వకముగా నిచ్చిన యీా కానుకలను మీారు నిరాకరింపరాదు.

వీర : రేపు నేను మహారాజును ఒప్పించెదను.

జయ : రేపు మహారాజు ధర్మపాలుఁడుకాఁడు. (యువరాజు వంకఁ జూచి) నామిత్రుఁడు యువరాజు రేపు ప్రభువు.

భీమ : రాజాజ్ఞను నేను జవదాఁటలేను. ఉంగరమును తీసికొ నుము. లేకున్న నాకుమాటవచ్చును.

వీర . మహారాజు వలన అపవాదము రాకుండచేయు భారము నాది.

(ప్రవేశము మంత్రి)

మంత్రి: అందఱును ఇక్కడనే యున్నారే-ఇంకను నిద్రపోలేదా?

యువరా: తండ్రిగా రింతకుముందే శయనమందిరము చేరినారు, అలసి యుండుటచే ఎక్కువ విశ్రాంతి కావలయునని.

వీర : నిరంతరాయమైన విశ్రాంతి కలుగుఁగాక.

భీమ: (మంత్రితో) నాకును వీరసింహునకును విచిత్రమైన ప్రణయ కలహము వచ్చినది.

మంత్రి: నాయిక లేకయే కలిగినదా ?

భీమ : మిత్రులకిరువురకు కలుగఁగూడదా?

మంత్రి: తప్పక - నాయికా నాయక భావముండినచో! (అందఱు నవ్వుదురు-వీరసింహుఁడుతప్ప) సేనాపతీ! నాసమాధానము సమంజసమైన దేనా?

వీర : ఔనౌను . అమాత్యుల వచనము లెప్పుడు సమంజసములు గాకపోయినవి?

మంత్రి: ఇంతకును కలహకారణమేమి?

భీమ : ప్రమీలాదేవి హృదయ పూర్వకముగా నొసంగిన స్వాగతమునకు హర్షించి మహారాజు ఈ యుంగరమును వారికి కానుకగా నంపియున్నారు. వీరసింహుఁడు వల దనుచున్నాఁడు.

మంత్రి. వీరసింహుఁ డట్లనువాఁడు కాఁడు. ఇది నిజమా?

వీర : ఊరకే అంటిని. ఉంగరము నిమ్ము. మిత్రులారా! నిద్రా సమయము దాఁటుచున్నది. రేపు కలసికొందము.

(వీరసింహుఁడు నిష్క్రమించును)

భీమ . వీరసింహుని హృదయము ఎందులకో సంక్షుభిత మైనట్లున్నది. మీరు గమనింపలేదా ?

మంత్రి : నాకును అట్లే తోఁచినది. ఆతఁడొసంగిన ప్రత్యుత్తరములను బట్టి మనమాట లాతని చెవికెక్కినట్లులేదు.

యువరా : ఈ రాత్రి కార్యక్రమము తొలుమాత్రైనందుకు విచారించుచుండునుకాఁబోలు.

భీమ : అంతమాత్ర మేమైనచో విచారములేదు.

మంత్రి : ఇంకేమియుండఁగలదు ?

భీమ : ఆనాఁడు యుద్ధరంగమున కన్పించిన యుద్విగ్నత యాతని ముఖమునం దిప్పుడు కాన్పించుచున్నది ఆ కంటిమెఱపు ప్రళయమును సూచించుచున్నది...

యువరా : ఈ విచారకాలుష్యమును నిద్రాజలముచే సంక్షాళిత మొనర్చుకొందము. కాలయాపన మెందులకు ?

(నిష్క్రమింతురు)

[ తెర ]

# రాజ్యకాంక్ష

## 5 వ రంగము

[వీరసింహుఁడు హత్యగావించుటకు మహారాజు నిద్రించు గది వైపు పోవుచుండును]

వీర : .. పతదుర్వీరుహ ఘోరశబ్దమయి,
క్షుబ్ధప్రోద్ధతాంభోద ము
క్తతటిత్ తీక్ష్ణతర ప్రభా క్షణిక
విధ్వస్తాంధకారమ్మునై,
హత నానా ఖగ జంతు కంఠరవమై,
ఔరా! ప్రపంచమ్ము భూ
త తమోభీకర సంగరాంగణమునాఁ
ద్రాసమ్ము గల్గించెడిన్.

ప్రపంచసమాధిపై ప్రకృతిశక్తులు ప్రళయతాండవము చేయుచున్నవి. వివృతాభ్ర కేశపాశములతో, భయద గర్జార్భటులతో, తటిద్దంష్ట్రాట్టహాసములతో, కాళ రాత్రి కరాళాస్యమును తెఱచుకొని నన్ను మ్రింగి వేయు నట్లున్నది . ఎక్కడి దా పైశాచిక మరణ రోద నము...నాహృదయ వికటార్భటులతో శ్రుతిగలపు కొనుచున్నది . వాతాయనములలోనుండి గాలి రివ్వున విసరుచున్నది.. ప్రతిశబ్దము నన్నిట్లు భయకంపితుని

చేయుచున్న దేమి? ..ఖడ్గధారవలెనున్న దా మెఱపు-
ఔను-అది చేయవలసినకార్య మట్టిది - ధరణీధరశిరో
భాగములను వ్రక్కలు చేయుటగదా!.. .........
ఆకాశము నాతలమీఁద నొఱగినట్లున్న దేమి? ...నక్ష
త్రములు పట్టువీడి క్రిందఁబడునా? . నా పాదముల
క్రింద భూమి విశీర్ణమై నన్ను పాతాళమున కీడ్చుకొని
పోవుచున్న దా యేమి? .. ఛీ . ఇంత స్వల్ప కార్య
మున కింతసంక్షోభ మేందులకు?

(పోఁబోయి తటాలున నిలుచును. ద్వారమునొద్ద గాలిలో నొక
కృపాణము కనఁబడును)

...ఎక్కడి దా కృపాణము? .. గాలిలో నుద్భవించి
నదా? (పట్టుకొనుటకు చేయిసాఁచును) .. చేతికందదు...
కంటికి కనిపించు చున్నది . ఓమారకదృశ్యమా!
చింతానిదాఘపీడితమైన నాశిరస్సునం దుద్భవించిన
మనఃకృపాణమవా? అలీకసృష్టి వా? (తనకృపాణముచూచి)
నాకృపాణము వలెనే యున్నది. .. రక్తబిందువులు
కారుచున్నవి. .. ఇంతకుముందులేవు నాసర్వేం
ద్రియములు నన్నే మోసగించుచున్నవా?...భ్రాంతి
. .భ్రాంతి .. వేఱేమియును కాదు .. ఆఘాతుక
కృత్యమే ఈరూపమున ప్రత్యక్షమగుచున్నది. (గంటవిని
పించును)కాలయాపనము కార్యభంగమునకు మూలము.
మహారాజు ధర్మపాలుఁడు ఇఁక లేఁడు.

(వీరసింహుఁడు నిష్క్రమించును )

(ప్రవేశము ప్రమీల)

ప్రమీ :.. ఎంతసేపైనది... ఇంకను ఏమిచేయుచున్నాఁడు. . హృదయము చలించినదా... రక్షకభటులు ఒడలు తెలియకపడియున్నారు ... ఇంకెవ్వరును మెదలుట లేదు... మహారాజు నిద్రించునపుడు నా తండ్రిపోలికలు కాన్పించినవి ... లేనిచో ఈ కార్యము నేనే చేసి యుందును. .

(ప్రవేశము వీరసింహుఁడు)

వీర : రాక్షసకృత్యము రాక్షసకృత్యము .. ..

ప్రమీ : నాథా!

వీర : ఊరకుండుము. నీకేమియు శబ్దము వినఁబడలేదా ?

ప్రమీ . ఏమిశబ్దము ? గుడ్లగూబ యఱపు వినఁబడినది. మీ రేమైన మాటాడితిరా ?

వీర . ఎప్పుడు ?

ప్రమీ : ఇప్పుడు.

వీర : నేను వచ్చునపుడా ?

ప్రమీ . ఔను.

వీర . లేదు .ప్రక్కగదిలో ఎవరు నిద్రించునది ?

ప్రమీ . ఎవ్వరునులేరు.

వీర : ...ఇది విషాదకరము...

ప్రమీ : కాదు - అభ్యుదయకరము.

వీర : రక్షకభటులలో ఒకఁడు కలవరముగా మేల్కొని హత్యయని కేకవైచెను.

ప్రమీ : అది నిద్రలోని మాట.

వీర . వెంటనే యిరువురును దేవుని స్మరించుకొని నిద్రించిరి. ఆవాక్యములు నా హృదయములో అశనిపాతమువలె గ్రుచ్చుకొన్నవి! దైవచింతనము నాకేల యింత భయంకరము కావలయును ?

ప్రమీ : జరిగినదానిఁగూర్చి యింత ఆలోచన కూడదు.. అది ఉన్మాదమును కలిగించును. రమ్ము. ఈ రక్తము కడిగివేసెదను.

వీర : ఎవరో నా చెవియందిట్లు పలుకుచున్నారు. "వీరసింహుఁడు నిద్రితుని వధించెను - ఆతనికి ఈ జన్మమందింక నిద్ర లేదు - శాంతిలేదు -"

ప్రమీ : నాథా ! ఎవరట్లు పలుకునది ?

వీర : నిష్కళంకమగునిద్ర.. శ్రాంతశరీరమునకు సుఖస్నానమగునిద్ర. మనఃక్షతికి అమృతావలేపనమగు నిద్ర.. జీవితపువిందునకు మధురమధురసంబగు నిద్ర. .

ప్రమీ : ఏమి యీ ప్రసంగము ? ఎవరట్లుపలుకునది ?

వీర : ఆ ధ్వని దుర్గమంతయు నిండిపోయినది. నీకు వినఁబడుట లేదా ?

ప్రమీ : ఈ గాలివాన యఱపులో ఏ శబ్దమును వినఁబడదు.

వీర : గాలివాన విసరుచున్నదా ?

ప్రమీ : నాథా! ఏల యిట్టి అపోహలకెడమిచ్చెదరు ? ఎందుకింత విభ్రాంతి ? అయ్యో, ఆబాకు నిచ్చటికేల తెచ్చితివి? అది రక్షకభటులది. మరల పోయి దానిని వారియొద్దనే విడిచిరమ్ము.

వీర : ఆ బీభత్సము తలంచినంతనే భయమగుచున్నది. మరల నేను దానిని చూడఁజాలను.

ప్రమీ : అస్థిరబుద్ధి ! కృపాణము నిటు తెమ్ము.

(వీరసింహుని చేతిలోని కృపాణము తీసికొని) నిద్రించువారును, మరణించినవారును చిత్రప్రతిమలు. చిత్రములోని దయ్యమునుచూచి పసిపాపలు భయపడుదురు!!

(ప్రమీల నిష్క్రమించును)

వీర : ఆ శబ్దమెక్కడిది? ప్రతిశబ్దమును నన్నిట్లు భయకంపితుని చేయుచున్న దేమి? ఏమియీ హస్తములు! దీర్ఘనఖాగ్రములతో నా కన్నులు పెకల్చి వేయుచున్నవి...

సప్తమహాసముద్రములలోని జలమంతయు ఈహత్యా చిహ్నములను సంక్షాళన మొనర్చి పవిత్రీకరింపఁజాలవు! ఈ రక్తబిందువులే వినీలజలరాశినంతయు ప్రశోణిత మొనర్పఁగలవు!

(ప్రవేశము ప్రమీల)

ప్రమీ : నాచేతులును రక్తసిక్తములైనవి. కాని నాస్త్రీహృదయము నీపౌరుషము నవమానపఱచుచున్నది. (శబ్దము) దక్షిణద్వారము నొద్ద శబ్దము - రమ్ము పోవుదము. దోసెఁడు నీళ్లతో ఈకార్యమునుండి విముక్తులము కాఁగలము. ఎంతసులభముగా నెఱవేరినది. (మరలశబ్దము) అయ్యో అట్లుశూన్యదృష్టితో నిలఁబడెదవేల? ఇక్కడ మన ముండరాదు...రమ్ము రమ్ము...రమ్ము...

వీర : ఈహత్య నన్ను విడిచిపోదు . . . ధర్మపాలుఁడు మరల బ్రతికి రాఁగలఁడా?

[ తెర ].

# రాజ్యాకాంక్ష

## 6 వ రంగము

(మణిదుర్గము-ఉదయము - భీమసింగ్, రణసింగ్ ప్రవేశము)

రణ: రాత్రి యెంత భయంకరముగా నుండినది? మేము నిద్రించు గదిలో దీపము లారిపోయినవి. గాలిలో ఏడ్పులు వినవచ్చినవి. భూదేవి భీతిచే కంపించి నట్లుండినది.

భీమ: ఈ యుత్పాతములు భావిసంక్షోభమును సూచించు చున్నవి. నీకు నిద్ర పట్టినదా?

రణ: లేదు. దుస్స్వప్నములచే చిత్తము కలఁగి పోయినది. ఐనను మన వీరసింహుని దుర్గమున మన కేమిభయమని నిద్రించితిని.

భీమ: .. ఊఁ .

రణ: ఏమి ఆలోచించుచుంటిరి?

భీమ. స్వప్నములు యథార్థము లగునని నీకు నమ్మక మున్నదా?

రణ: స్వప్నము యథార్థ మగునని యెవ్వఁడు చెప్పఁగలఁడు?

భీమ: నేను.

రణ: ఎట్లు?

భీమ: అది చెప్పుట నా శిరస్సునిచ్చుటయే! చూచుము. సాన పెట్టిన కత్తివలె తూర్పుదిక్కు తళతళ మెఱయు చున్నది. ఆధివ్యాధి విముక్తుఁడైన ప్రశాంతుని మానసమువలె ఆకాశము అత్యంత నిర్మలమైయున్నది. నన్ను ఉదయముననే మేల్కొల్పుమని మహారాజు ఆజ్ఞాపించిరి. కాలముదాఁటినట్లున్నది. రమ్ము.

(నిష్క్రమింతురు)

(ప్రవేశము వీరసింహుఁడు)

వీర: ఈ కార్యము బహిరంగమగుకాలము సమీపించినది. వేయినాలుకలు హంత క్రౌర్యమును బయల్పఱుపఁగలవు; నైచ్యమును నిందింపఁగలవు, పాపమును శపింపఁగలవు. మధురజీవితానంద మరందమందు హాలాహలము కలిపికొంటిని. . జరిగినదానిఁగూర్చి చింతించుట దౌర్బల్యము! ప్రమీల నాకంటె నెంతటి గభీర హృదయ. . హంత యెవఁడు? ఎవఁడో? ఎట్లు తెలియును? నన్నెవ్వ రనుమానించునది? అట్లనుమానించినవారి ప్రాణములు .. ...

(ప్రవేశము భీమసింగ్, రణసింగ్)

భీమ. ఘోరము. ఘోరము—హత్య...హత్య

రణ: హత్య. .హత్య...

భీమ : జయసింగ్ ! యువరాజా ! మీరును చచ్చితిరా యేమి !

వీర : హత్య...ఎవరిది ?

భీమ : ఎవరిదా ?

వీర : ఎవరిది ?

భీమ : మహారాజు హత్య ! ఎవ్వఁడో హితశత్రువు..

వీర : .ఆ (కత్తిమీఁద చేయిపెట్టి) ఈ అమంగళము పలికిన నీ నాలుక ఖండించెదను.

భీమ : (కత్తిని ఇంచుకలాగి) ఈ ఘాతుకకృత్యముచేసినవానిని శిరశ్ఛేదము గావింపవలయును.

వీర : భీమసింగ్, ఇది యుద్రేకమునకు సమయముకాదు. ఇది నిజమా ? లేక నీవు కలవరించుచున్నావా ?

భీమ : నేను మేల్కొనియే యున్నాను. ఇది స్వప్నముకాదు. యథార్థము. నీవు పోయిచూచి ఆ పైశాచికదృశ్యముచే అంధీభూతుఁడవుకమ్ము! .

(వీరసింహుఁడు నిష్క్రమించును)

రణసింగ్ ! నీ సైన్యదళమును సంసిద్ధముగానుంచుము. ఎట్లుండి యెట్లు రాఁగలదో తెలియకున్నది.

రణ . అట్లే. (రణసింగ్ నిష్క్రమించును)

(ప్రవేశము యువరాజు, జయసింగ్, సభ్యుడు)

భీమ : మీరు బ్రతికియే యున్నారా ?

యువరా : ఏమి ?

భీమ : హత్య . నీ ప్రాణదాతను గొంతుకోసి చంపినారు.

యువరా : మా తండ్రి - మహారాజు -

భీమ : ఔను.

(యువరాజు, జయసింగ్, సభ్యుడు మహారాజు నిద్రించు గది వైపు నిష్క్రమింతురు)

( ప్రవేశము వీరసింహుడు )

వీర : యుద్ధభూమిలో వీరులెందఱో మడిసిరి కదా! నేనును అచ్చటనే మరణించియుండిన జన్మ సాఫల్యము చెంది యుండెడిది. అంతయు నశించినది. సత్కీర్తి జీవితానందము ప్రపంచమును వీడిపోయినవి. ఇంక బ్రతికియున్న నేమి, చచ్చిననేమి ? నాసౌధమున రాజహత్యయా ?

( తెరలో 'హత్య హత్య'యని కేకలు)

(ప్రవేశము ప్రమీల)

ప్రమీ : ఏమి యీ వికటాక్రందనములు ? దుర్గమంతయు ప్రతిధ్వనించుచున్నవి. ఏమి జరిగినది?

భీమ : దేవీ! నేను చెప్పునది మీరు వినజాలరు. మీ కోమల హృదయము బ్రద్దలగును.

(ప్రవేశము యువరాజు, జయసింగ్, సభ్యుఁడు)

యువరా: మహారాజు హత్య.

ప్రమీ : అయ్యో! మా గృహముననా?

భీమ : ఎక్కడైనను ఇది మహాక్రూరము - మీ మణిదుర్గము మహారాజునకు మరణదుర్గమైనది !

(ప్రమీల మూర్ఛిల్లును)

వీర : ప్రమీలను తీసికొనిపొమ్ము.

(పరిచారిక ప్రమీలను తీసికొని పోవును)

భీమ : ఇది రాజ్యమునకు కఠోర పరీక్షాసమయము. హంత యెవ్వఁడైనదియు నిర్ణయించి శిక్షింపవలయును. లేనిచో ఈ హత్యాకాండయింతటితో ముగియదు. ఈ నాఁడు బయలు వెడలిన విషబాణము ఇంకను ఎందఱి హృదయములను భేదింపఁగలదో తెలియకున్నది !

సభ్యు : మహారాజు రక్షకభటులే యీ కార్యము చేసినట్లు న్నది. వారి వస్త్రములు నెత్తుటితో తడిసియున్నవి. వారి కృపాణములు నెత్తురు కార్చుచున్నవి. మేల్కొ నియు వారిచూపులు అమానుషములుగా నుండినవి.

భీమ : రక్షక భటులకు మహారాజు మీఁద ఇంతటి క్రోధ మెందులకో-

యువరా: ఎవ్వఁడో హితశత్రువు వారిచే నీఘోరకార్యము చేయించినట్లున్నది.

భీమ : వారిని పరీక్షింపవలయును.

వీర : ఆ ముష్కర కిరాతకు లిప్పటికే నరకమున శిక్ష ననుభవించుచున్నారు.

భీమ : ఏమి వారిని చంపితివా?

వీర : నీ ప్రశ్న అర్థమగుటలేదు.

భీమ : అర్థమగుట కేమున్నది. ఈ హత్యాకృత్యము అనూహ్యముగా నున్నది. వారుబ్రతికియుండినచో దీనికి ఆధారములు దొరికి యుండెడివి కదా?

వీర : నిజము - భీమసింగ్! నీవన్నది యథార్థము. కాని పరమధర్మాత్ముఁడగు ధర్మపాలుఁడు మాయింటి కతిథిగావచ్చుటయు,ఇట్టి ఘోరకృత్యమునకు గుఱియగుటయు చూచిన నామనఃస్థితి నీకెట్లు తెలియును?ఎవనియందైనను ఒకక్షణమున ఉద్విగ్నతయు బుద్ధిమత్త్వమును కూడియుండునా? కోపవేగమున ప్రసన్నత నిలుచునా? భక్తివిశ్వాసములుండియు, ఉపేక్షించుట సంభవించునా? మహారాజుమీఁద ప్రేమోద్రేకము విజృంభించి వివేకమును మ్రింగివేసినది. అట్టి స్థితిలో నీవుమాత్ర మేమి చేయఁగలవు? అటుచూడుము - హతుఁడైన ధర్మపాలుఁడు. ఆతని మిసిమిబంగారు మేనిపై నెత్తుటి

చాలు . పలితములై శుభ్రములై కాంతిస్ఫోరక
ములైన అతని శిరోజాంచలములపై రక్తబిందువులు...
పవిత్రమై నిద్రాముద్రితమైన ఆతని ముఖము రక్త
పంకిలమయ్యును సహజప్రసన్నతను వీడకున్నది... .
జలపూర్ణ మహాతటాకమునకు గండ్లవలె వక్షస్థలమున
ఆగాయములు-అట్టిదృశ్యమును చూచియు ప్రతీకారము
చేయకుండుటకు నా హృదయము పాషాణమా? నా
ధైర్యసాహసము లంతనీచములా? నా రాజభక్తి అంత
నీరసమైనదా ?

సభ్యు : కడచిపోయినదానికి విచారపడి యేమిలాభము ?

భీమ : మరణించిననారిసంఖ్య మూఁడైనది.

వీర : .. దీనిని అరికట్టవలయును. మీరందఱును దేశ
క్షేమమును ప్రజాహితమును కోరుచున్నవారేకదా.
వృధాసంభాషణముతో నేమిప్రయోజనము? రండు.
మనమందఱమును సభతీరి కర్తవ్యమును నిర్ణయింతము.

భీమ : అట్లే కానిమ్ము.

(నిష్క్రమింతురు యువరాజు సభ్యుఁడు
వెనుకకు మరలుదురు)

యువ : రాజద్రోహులు. గోముఖవ్యాఘ్రములు - హంత
మీలో నొకఁడుగాక మఱియెవఁరు ?

సభ్యు : ఆరక్షకభటులు మీ తండ్రి పెంచి పెద్దచేసినవారు, విశ్వాసఘాతుకులై వారిట్టి పాపకార్యముచేసిరనుట ముమ్మాటికి అబద్ధము.

యువరా : మనప్రాణములను కాపాడుకొనవలయును. మా తండ్రిని వధించిన విషసర్పము నాపై పగపట్టియుండక పోదు. ఈ మరణవ్యూహమునుండి నేను తప్పించుకొని పోవలయును. నాతో వచ్చెదవా? లేక ఆరాజద్రోహుల గూడెములో చేరెదవా?

సభ్యు : ప్రాణ మున్నంతవఱకును నీసేవకుఁడను.

యువరా : దుర్గమంతయు కల్లోలముగానున్నది. తప్పించుకొనుట కిదే సమయము. రమ్ము.

(వేఱొకప్రక్క నిష్క్రమింతురు)

[ తెర ]

# రాజ్యకాంక్ష

## 7 వ రంగము

[రాజధాని పొలిమేరలయొద్ద - ప్రవేశము ఒకవృద్ధుఁడు, వాని బంధువు ఒక యువకుఁడు]

వృద్ధు: ఒరే యేందిరా వూరంతా అల్లకల్లోలంగావుంది? మొన్న రేత్రి గాలివానదెబ్బకు జడిసిపోయి జనమంతా వుక్కిరిబిక్కిరై వుంటే మళ్లా యేమొచ్చిందిరా గొడవ? ఏం పాపకాలంరా యిది? మారాజు దరమపాలయ్య వుండంగానే యీ విపరీతాలేందిరా?

యువకు: తాతయ్యా, యేలోకంలో వుండావునీవు?

వృద్ధు: ఆ - యీపాడులోకంలోనే - యెప్పుడా కైదు విడుదలయ్యేదని యెదురుచూస్తుండా.

యువకు: మారాజు యింకా యాడున్నాడు? మొన్న రేత్రి మణిదుర్గంలో యెవరో చంపేశారాని యినలా నీవు?

వృద్ధు: మారాజునే చంపెయ్యడమే .. యేమ్మాటలురా?

యువకు: ఔను తాతయ్యా, వూరంతా యెట్టుందనుకున్నావు. పిల్లాపెద్ద ఆడోళ్లుమొగోళ్లు నిర్గాంతం పోయి వుండారు. యాడచూచినా జనమంతా మారాజుచావుకు యాడవడమే! ఆయనలాంటి దరమాత్ముడికి యీలోకంలో చోటులేదులే తాతయ్యా!

వృద్ధు: అయ్యో - ఆయ్యో - మారాజుచచ్చిపోయినా యింకా నాకు చావురాలేదే . మారాజు నిజంగా దరమరాజే యెవర్రా యెందుకురా చంపడం?

యువకు: ఆ యిషయాలన్నీ మనకేం తెలుస్తాయి తాతయ్యా?

వృద్ధు: అయితే చంపినోడు దొరకలా?

యువకు: నేరంజేసినోడు యాడన్నా దొరకడం జూచినా? మా రాజుకొడుకే రాజ్యం కోసం చంపేశాడని వూళ్లో పుకారా పూరాగా వుంది. దండోరాగూడా యేశారు- యువరాజు తప్పించుకోపొయ్యాడనీ పట్టిస్తే మాంచి బహమానమిస్తామనీ-వూరంతా గాలిస్తుండారు యాడైనా దొరుకుతాడా అని.

వృద్ధు: యేం యిపరీతంరా? కొడుక్కే-కదంట్రా రాజ్యంవొచ్చేది. దాని కోసరం అబ్బను చంపడం యేందిరా తలకాయ లేని మాటలు?

యువకు: తాతయ్యా మన కెందుకులే అదంతా - వాళ్ల పాపాన వాళ్లుపోతారు. •ఆమాట కాదంటే ప్రాణంమీాది కొస్తుంది తెలుసా?

వృద్ధు: యెందుకూ, వున్నమాట అనుకోకూడదేం?

యువకు: నీకు తెలేదు తాతయ్యా, యిప్పుడు సేనాని యీారసింహుడు రాజు తెలుసా?

వృద్ధు: అయితే?

యువకు: ఆయనే యీాదండో రా యేయించింది. యువరాజే యీాపని జేశాడనీ యీాడన్నా యెవరన్నాకాదంటే ఆళ్లని కైదులో పెట్టాలనీ ఆజ్ఞ - వూరంతా గడగడలాడి పోతూంది. వూర్కుంటే పోతుంది, మనకెందు కొచ్చిన గొడవ - మనమేం రాజ్యాలేల్తామా?

వృద్ధు: ఓరి చచ్చుపీనుగు లాగున్నా వే! ప్రాణాలకు వెరిస్తే నిజం యెట్టా తెలుస్తుందిరా? బలంవున్నోడు నందిని పందంటే నమ్మాల్సిందేనా? గుండెధైర్యం లేదంట్రా?

యువకు: యిదో చెప్తుండా - వూళ్ళో సిబ్బంది బలంగావుండాది యీాడకూ్కడా వస్తారేమో-వూర్కుంటేపోతుంది (భయముతో చూచి) అదో, ఆళ్ళెవరో వస్తుండారు!

(ప్రవేశము యువరాజు సభ్యుడు - మారు వేషములతో యాత్రికులవలె)

యెవరయ్యా మీారు?

యువరా: మేము యాత్రికులం. నగరంచూడ్డానికి వచ్చాము. మేము కాలుపెట్టిన వేళావిశేషమేమిటోగాని, యిన్ని విపరీతాలు పుట్టాయి. ఈకత్తెరబోనులోనుండి ప్రాణాలతో బయటపడితే చాలనుకుంటున్నాం.

వృద్ధు: (దగ్గఱకువచ్చి) మా రాజుల్లాగున్నా రే!

యువరా : మహారాజులవలె కనబడినంతమాత్రాన్నే మహారాజు లౌతారా ? కనబడేదానికి యధార్థానికి చాలా వ్యత్యాసం వుంటుంది.

వృద్ధు : నిజంబాబు. చిన్నోడివైనా నిజంచెప్పావు. యాడక పోవడం ?

యువరా : మావూరికి. అలసిపోయివున్నాము. నాయంత్రిందాకా గుడిసెలో నిద్రపోయి రాత్రి వెళ్ళిపోతాం. కొంచెం చోటిస్తే చాలు.

వృద్ధు : దానికేం పడుకోండి బాబు.

యువకు: తాతయ్యా, ఆళ్లెవరో యెందుకొచ్చారో తెలేకుండానే చోటిస్తుండావే. నాకేమో అనుమానంవేస్తుండాది తాతయ్యా !

యువరా : (బెదిరించినట్లు) నీ అనుమానమేమి ?

యువకు : (నీళ్ళునములుతూ) యేంలేదుబాబూ, యువరాజు మారు వేషంతో తప్పించుకోపోతున్నాడని విన్నాంకదూ... అందుకోసం .

యువరా : ఓరి పిచ్చివాడా! మారువేషంతో తప్పించుకొని పొయ్యే యువరాజు నీ యెదుట నిలబడి యింతసేపు తీరికగా కాలక్షేపంచేస్తాడటరా ? వెఱ్ఱివాడా, యువ రాజు మిక్కిలి మేధావి. ఎప్పుడో మేఘాలమీద పట్టణం దాటపోయివుంటాడు.

వృద్ధు : పోనీలే బగవంతుడు యువరాజునైనా రక్షించాడు. (యువకునితో) ఒరే ఆల్లు యాత్రకోసంవొచ్చి యీడ కాస్సేపు నిద్రపోవడానికి చోటడిగితే దానికేందిరా నీ అనుమానం? ఆడ గుడెసెవుందికాని పొయి పడు కోండి బాబు.

యువరా : నీ సహాయం మేమెప్పుడు మఱచిపోము. కాలమను కూలించినపుడు ప్రత్యుపకారం చేస్తాము.

వృద్ధు : ఇంకా నాకేం వుపకారం కావాలె బాబు, కాటికి కాళ్లు చాచి కూరోచ్చివునోన్ణి. మీారెల్లి పడుకోండి.

(యువరాజు, సభ్యుడు నిష్క్రమింతురు
ప్రవేశము ఇద్దఱు రాజభటులు)

1 భటు : ఏయ్ ముసలోడా, యీతట్టు యెవరైనా వొచ్చారా?

వృద్ధు. యెవరుబాబు మీారు?

2 భటు: కళ్లు కనబడలా - యెవరైంది తెలేలా నీకు?

వృద్ధు: కళ్లు నిజంగా కనబడడంలేదు బాబు, యీా పాడు లోకాన్ని చూడకుండా కళ్లుపోవడమే బాగుంటుంది బాబు.

1 భటు: ఏయ్ - నోరు మూసుకోని జవాబు చెప్పు. యీతట్టు యెవరైనా మెదిలారాని అడగడం!

వృద్ధు. యెవరుబాబు?

2 భటు: యువరాజు వేషంమార్చి తప్పించుకో పోతున్నాడని యినలా?

వృద్ధు: యినలేదు బాబు! యెందుకు తప్పించుకో పోవడం?

1 భటు: మహారాజును చంపించాడని.

వృద్ధు: యెందుకు చంపడం బాబు?

1 భటు: నీకుంటి ప్రశ్నలకు జవాబు చెప్పడానికి రాలా మేము.

వృద్ధు: ముసలోణ్ణి బాబు, యిషయమేమో తెలుసుకుందామని అడగడం.

యువకు: తాతయ్యా, మన కెందుకులే ఆ యవ్వారాలన్నీ యీ తట్టు పిట్టపురుగు రాలేదు బాబు.

వృద్ధు: యెందు కోసం చంపడం బాబు?

1 భటు: రాజ్యం కోసరం.

వృద్ధు: మా రాజు దరమపాలయ్య కొడుక్కే పట్టాభిషేకం చెయ్యాలనుకుంటుండాడని యిన్నాంకదూ - యీలోగానే చంపేశాడినడం యేం నమ్మడానికి యీల్లేకుండా వుంది బాబు.

భటులు: ద్రోహి - రాజద్రోహి!

(వృద్ధుని కొట్టుచుండగా భీమసింగ్ ప్రవేశము)

భీమ: (భటులనుచూచి కోపముతో) ఆగండి- (భటులు భయపడి వెనుకకు పోవుదురు)

యువకు: చంపేస్తుండారు బాబు.

భీమ : (భటులతో) ఆవృద్ధునిమీదనా మీ ప్రతాపము?

యువకు: మేమేం తప్పుచెయ్యలేదు ప్రెబూ.

భీమ : నీ పిరికితనమే నీతప్పు. (వృద్ధునితో) ఎమిది?

వృద్ధు: మారాజును యువరాజే చంపాడనడం...

భీమ : అర్థమైనది ... (భటులతో) బుద్ధిహీనులారా! ఆవృద్ధుని మెదడులోనున్న యూహ మీకులేదు.

1 భటు: మేమురాజాజ్ఞను పాటిస్తున్నాము ప్రభూ.

భీమ : రాజాజ్ఞ యేమని?

1 భటు: రాజద్రోహులను బంధింపవలెనని.

భీమ : (వికటముగా) రాజద్రోహులు - ఊఁ - బంధింపుఁడన్న హింసింపుఁడని యర్థమా?

యువకు: రక్షించండి బాబు. .

భీమ : (వృద్ధునితో) నీవు భటులతోపోవకతప్పదు.

వృద్ధు . నాకేం బయం ప్రెబూ - యెళ్తాను.

(భటులు వృద్ధునితీసికొనిపోవుదురు యువకుఁడుకూడ పోవును)

భీమ : నిజమైన రాజద్రోహి దొరకకపోఁడు.

(భీమసింగ్ నిష్క్రమించును)

(ప్రవేశము, యువరాజు, సభ్యుఁడు)

యువరా : ప్రజాహింస ప్రారంభమైనది. ప్రజాపాలనక్షమాలు ప్రజాపీడనము నూతన యుగధర్మము కాఁబోలు.

సభ్యు : వీరసింహునికి వినాశకాలము సమీపించినది. వేల కొలఁది అమాయిక ప్రజల ఆక్రందనములే ఆతని నిర్మూలింపఁగలవు.

యువరా : అట్లని మన మూరకుండరాదు. ఇచ్చటికి పదిమైళ్ళ దూరములోనున్న శైలారణ్యమునందు దాఁగియుండి క్రమముగా మనబలము వృద్ధిచేసికొనవలయును. ప్రజలలో సైన్యములో రాజభక్తికలవా రెందఱోకలరు. కాలక్రమమున వారినందఱును ఒక్కచోటికి చేర్చి వీర సింహుని వధించి రాజ్యము సాధింపవలయును. రమ్ము.

(నిష్క్రమింతురు)

[ తెర ]

# రాజ్యకాంక్ష

## 8 వ రంగము

[రాజధాని - రాజభవనములో వీరసింహుఁడు]

వీర : కోడె త్రాఁచు దెబ్బతిని తప్పించుకొని పోయినది. సన్నిహితులైనవారిలో విహితు లెవ్వరో విద్వేషు లెవ్వరో గుర్తింపరాక అందఱును తేనెపూసిన కత్తులవలె నగపడుచున్నారు. హంతనుగూర్చి ప్రజలలో పొడముచున్న సందేహములను మున్ముందు నిర్మూలింపవలయును.

(ప్రవేశము - దండనాథుఁడు)

దండ : జయము మహారాజునకు!

వీర : మీ అభివాదనములు సారహీనములు!.యువరాజు జాడ లేమైన దొరకినవా?

దండ : లేదు-ప్రయత్నించుచున్నాము.

వీర : నీ సైన్యదళము నిద్రించుచున్నట్లున్నది. మాఱువేషముతో శిక్షార్హుఁడగు హంత తప్పించుకొని పోఁగలుగుట నాప్రభుత్వమున కవమానకరము.

దండ : ప్రభూ, రెండుమూఁడు దినములలో యువరాజు పట్టుపడఁగలఁడు.

వీర : ఈ యుపచారవాక్యములతో నేమి ప్రయోజనము?

దండ : పట్టణమంతయు గాలించుచున్నాము. మే మనుమానిం చిన వారిని చెఱసాలలో బంధించుచున్నాము. నిన్న సాయంకాలము రక్షకభటు లొకవృద్ధుని బంధించి తెచ్చిరి. ఆతని వలన కొంత విషయము గ్రహింపఁ గలము. మీరు కోరినచో వాని నిచ్చుటకిఁ బిలిపించెదను.

వీర : రానిమ్ము.

(ప్రవేశము వృద్ధుఁడు భటునితో)

వృద్ధు: దండాలు ప్రెబువు గారికి.

వీర : నీ నమస్కృతులతో మాకు పని లేదు - నీవెవరు?

దండ : నిజంచెప్పు, లేకున్న ప్రాణాలు దక్కవు.

వృద్ధు: ప్రాణాలు పోతాయని నిజంచెప్పేవాణ్ణి కాదండి-నిజం కోసరమే నిజం చెప్తానండి.

వీర : వెండ్రుకలు నెఱసినను రక్తములో నుడుకు చల్లాఱ లేదు. నీ నిర్భయత్వము మా కాశ్చర్యము కలిగించి నను సంతృప్తికరముగ నేయున్నది. నీకథ వినిపింపుము.

వృద్ధు: నిన్న సాయంత్రం మావోడొచ్చి మారాజు నెవరో చంపేశారని యువరాజు తప్పించుకొ పొయ్యాడనీ ఆయన్ని పట్టుకోడానికి సిబ్బంది తిరుగుతుండాదని చెప్పాడు. యీలోగా యెవరో యిద్దరు యాత్రీకు

లొచ్చి కాస్సేపు గుడిసెలో చోటిస్తే నిద్రపోయి యెళ్తామని అడిగారు. ఐతేనేమని చోటిచ్చా - వాళ్లు ఆలాగెళ్లారూ భటులొచ్చి నన్నడిగారు యెవరైనా ఆతట్టు మెదిలారా అని. మావాడు చెప్పినకదేవాళ్లూ చెప్పారు-నేను నమ్మలేకుండావుండా ప్రెబూ!

వీర : నీ అపనమ్మకము రాజాజ్ఞకు వ్యతిరేకమని నీకు తెలియునా?

వృద్ధు: ఆమాటా చెప్పారు ప్రెబూ! కాని మారాజును యువరాజే చంపా డనడం నాకేం నిజంగా తోచడం లేదు ప్రెబూ!

వీర : అట్లైన నీ చావు తెలివికి ఏమని తోఁచుచున్నది?

వృద్ధు: నే నేంచెప్పేది ప్రెబూ-ఆయనకు తెలేని యిరోదు లెవరైనా వుంటే వాళ్లేమైనా చేసి నేరం యువరాజు మీాద తోశా రనుకుంటుండా ప్రెబూ!

వీర . (స్వగతము) ద్రోహి- ఈ వృద్ధశవమును చంపి యేమి ప్రయోజనము?. ఈతని పలితకేశములు ధర్మపాలుని జ్ఞప్తికి తెచ్చుచున్నవి. (బహిరంగముగా) నీ యూహ రాజద్రోహ మని నీవెఱుఁగవా?

వృద్ధు: నేను రాజద్రోహిని కాను ప్రెబూ. అను కుంటున్న మాట మనవిచేసుకుంటున్నా!

వీర : నీవు చూచిన యాత్రికుల విషయమై భటుల కెందుకు చెప్పియుండలేదు?

వృద్ధు: చెప్పేవోణ్ణే - యీలోగానే నన్ను కొట్టి లాక్కో-పొయ్యారు ప్రెబూ.

వీర : బుద్ధిహీనులు - (దండనాథునితో) ఈతని ప్రత్యేకమైన చెఱసాలలో బంధింపుము.

దండ: ఆజ్ఞ (భటుండు వృద్ధుని తీసికొనిపోవును) మహారాజా! ఇంత కన్న తీవ్రచర్య తీసికొన్నంగాని యీ రాజద్రోహుల దుష్ప్రచారము నిర్మూలము కాదని నామనవి.

వీర : తీవ్రచర్య! నిజము. ఈ విషపుటూహాలు అంటువ్యాధి వలె క్షణములో పౌరహృదయమును కలుషీకృత మొనర్పంగలవు. భయ పెట్టినంగాని దీనిని అరికట్టం జాలము. ఇంకమీంద రాజద్రోహులకు మరణ శిక్ష యని ప్రకటింపుము ఈవృద్ధున కగపడిన యాత్రికు లెవరో విచారించి తత్ క్షణమే తగుచర్య తీసికొనుము.

దండ: ఆజ్ఞ (దండనాథుండు నిష్క్రమించును)

వీర : ఆ వృద్ధ కళేబరమునం దెంతటి నిగూఢశక్తి దాంగి యున్నది! అట్టి వా రెందఱుకలరో! ఎందఱైన నేమి? ఈ మరణశాసనము దుష్ప్రచారముకంఠము నులిమి వేయంగలదు.

(ప్రవేశము భటుఁడు)

భటు: ప్రభూ, భీమసింగ్ వచ్చి యున్నారు.

వీర : ప్రవేశపెట్టుము (భటుఁడు పోవును. స్వగతము) ఈ భీమసింగ్ ప్రక్కలో బల్లెమువలె నున్నాఁడు. ఈతని రాజనీతి లోఁ తెలుసుంగరానిదిగా నున్నది. వీనిముందు నా ప్రతిభ తేజోవిహీనమగుచున్నది. బురఖా వెనుక వీని నగ్న స్వరూపము కనుఁగొనవలయును.

(ప్రవేశము భీమసింగ్)

భీమ : మహారాజా! పట్టణమంతయు పొంగిన సముద్రమువలె సంక్షుబ్ధముగా నున్నది.

వీర : గూఢచారులవలన అంతయు తెలిసినది. భీమసింగ్! యుద్ధరంగమున వీరవిహారమున కలవాటుపడిన మన కీ యలజడి యేపాటిది? నీటి బుడగవలె ఈ ఆందోళనము క్షణకాలములో మాయమై పోఁగలదు.

భీమ : మహారాజా! యుద్ధము శత్రువులతో కదా - వీరు దేశ ప్రజలు.

వీర : అట్లైన రాజద్రోహులు శిక్షార్హులు కారనియా నీ మతము?

భీమ : వేలకొలఁది ప్రజలు చెఱసాలలో బంధింపఁ బడుటయు-

వీర : బంధింపఁబడుటయే కాదు. నేఁటినుండి రాజద్రోహులకు మరణమే శిక్ష.

భీమ : ప్రజలు భయార్తులై కట్టుగుడ్డలతో నట్టడవుల పాలౌటయు మీ ప్రభుత్వ మర్యాదకు తీరనికళంకమని నామనవి.

వీర : (వికటముగా) నీ ప్రజాభిమానము మన్నింపఁదగినది.... రాజభక్తి లేని ప్రజాభిమానము అరాజకమునకు దారి తీయునని నీకు తెలియదా? భీమసింగ్, ఇది సంధికాలము_ నీకును నాకును అతి విషమ పరీక్షాసమయము.

భీమ : మహారాజా! రాజపదము అస్థిరము. నిన్నటి ధర్మపాలుఁడు నేఁడు లేఁడుకదా!

వీర : ఓహో! యుద్ధవీరుఁడవైన నీయం దింత వేదాంతము కలదని నే నూహించియుండలేదు. నేఁటి వీరసింహుఁడు రేపుండఁడనియా నీతలంపు?

భీమ : అమంగళము శాంతించుఁగాక.

వీర : నీ యాశీర్వచనమునకు కృతజ్ఞులము. .... మాకుఁ గావలసినది నీ బాహుబల సహాయముగాని నీ శుష్క ఆశీస్సులు కావు.

భీమ : మహారాజు నన్నారకయే అనుమానించుచున్నారు.

వీర : భీమసింగ్, చిరకాలమిత్రుఁడవు - నీపై నా కనుమాన మెందులకు? నీ సిద్ధాంతములు విన కుతూహలపడుచున్నాను.

భీమ : యువరాజుమీఁది నిందారోపణము ప్రజానిర్ణయము నకు వదలివేయుట శ్రేయస్కరమని నా మనవి. యువ రాజును తన నిర్దోషిత్వమును తానే ప్రజాప్రతినిధుల మ్రోల నిరూపించుకొననిచ్చినచో ఈ కల్లోలమింత టితో నంతరింపఁగలదు.

వీర : (స్వ) ద్రోహి ! (బహిరంగముగా) నీ సిద్ధాంతములు విస్మయావహములుగా నున్నవి. రాజనిర్ణయమును ప్రతిఘటింపఁగల యీ ప్రజాప్రతినిధులెవ్వరు? ఎవ్వరి బలమున వారు నాకు ప్రతివీరులై నిలువఁగలరు? వినాశకాలమునకు విపరీతబుద్ధులు!

భీమ : మహారాజా ! ప్రజాబలము

వీర . భీమసింగ్ ! విన్నది చాలును. ఈ యూహాలు ప్రజలవి కావు. వారివెనుక గూఢవర్తనులైన రాజద్రోహులవి. ఐనను భీమసింగ్, బహుకాలమిత్రుఁడవు. నాతో సమానమైన శూరశిరోమణివని విఖ్యాతిగాంచిన వాఁడవు. నీ యభిప్రాయము త్రోసిపుచ్చఁదగినది కాదు. అత్యవసరమగుటచే నేఁటిరాత్రి రహస్యసమా లోచన సభయందు దీనిని చర్చించెదను. నీవు తప్పక సభకు రావలయును.

భీమ : నేఁటిరాత్రి ...

వీర : ఇతరకార్యములున్నవా ?

భీమ : పట్టణము పొలిమేరలయొద్దకు పోయి కావలసియున్నది.

వీర : నీ వొక్కఁడవేనా ?

భీమ : జయసింగ్ కూడ రాఁగలఁడు.

వీర : మంచిది. నీవంటి ఆశ్వికునకు దూర మొక లెక్కలోనిది కాదు. నేఁటి రాత్రి - మఱవకుము.

భీమ : ఆజ్ఞ. (భీమసింగ్ నిష్క్రమించును)

వీర : ఈ భీమసింగ్ విహితునివలె నటించుచు నా కంఠమున కే ఉరిత్రాడు బిగింపయత్నించుచున్నాఁడు. బలవంతుఁడు. ప్రజాభిమానము చూఱగొన్నవాఁడు. శౌర్యముతో సమానమగు దీర్ఘాలోచనకలవాఁడు. రాజద్రోహియని యీతని చెఱసాలలో బంధించుట నిప్పుతో చెరలాటము. రహస్యవధయే మార్గము - రహస్యవధ!

(ప్రవేశము రోహిణి)

రోహి: మహారాణి మీతో మాట్లాడవలెనని చెప్పిరమ్మన్నారు.

వీర : మహారాణి యెవరు ?

రోహి : ప్రమీలా దేవి.

వీర : ప్రమీలయా - రమ్మనుము.

(రోహిణి పోవును. ప్రవేశము ప్రమీల)

ప్రమీలా ! శత్రుమధ్యమున ఈ మహారాజపదము శ్మశానములో రుద్రతాండవమువలె నున్నది.

ప్రమీ : నాథా! ఇట్టి విపరీతపు టూహలు కల్పించుకొని యొంటరిపాటున మనస్సున కశాంతి కలిగించుకొనుచున్నారు. జరిగినది జరిగిపోయినది. విధి బలీయమని మీరెఱుంగనివారుకారు.

వీర : ప్రమీలా! రాజపదము సాధించుట అల్పకార్యము. దానిని సుస్థిర మొనర్చుకొనుట దుర్ఘటముగా నున్నది. కాలకాకోదరము కత్తిపోటుచే గాయపడినది గాని చావలేదు. అచిరకాలములో నది సహజస్థితిని చెంది కాలకూటదంష్ట్రిలతో పడగవిప్పి మన మీఁదికి రాఁగలదు.

ప్రమీ : నాథా! మీ ధైర్యస్థైర్యములను మీరే వికల మొనర్చుకొనుచున్నారు. వీరసింహుఁడు మహావీరుఁడను ప్రజాప్రశంసలను జ్ఞప్తికి తెచ్చుకొనుఁడు. ఈ భయభ్రాంతులకు తావొసంగకుఁడు.

వీర : ప్రజా ప్రశంసలా! ఏప్రజానీకము నా మహాద్భుత విజయ పరంపరలకు ఆశ్చర్య చకితమై నగర వీధుల యందు పుష్పాంజలులతో నన్నుసత్కరించినదో, ఆప్రజానీకమే నేఁడు వీరసింహుఁడు క్రూరకిరాతుఁడని నీరవ కంఠములతో శాపాక్షరములు వెదచల్లు చున్నది.

ప్రమీ: ప్రజలా?

వీర : ఔను.

ప్రమీ: కారణము?

వీర: ఈ విషమసంఘటనలు నీ వెఱుంగకుండుటయే మేలు.

ప్రమీ: నాహృదయము బ్రద్దలు చేయకుఁడు.

వీర: ప్రమీలా! నీపై అనురాగము చేతనే యీ విషయము లింతవఱకును నీ కజ్ఞాతముగా నుంచితిని.

ప్రమీ: అట్టియనురాగము నే నెన్నఁడును కోరియుండలేదు

వీర: అనురాగము-జీవితానందము- యశఃకీర్తులు-అన్నియు మంటలోఁ గలసినవి. ప్రమీలా! నాహృదయము వృశ్చిక పన్నగములు ప్రాఁకులాడు నంధకార గహ్వర మైనది.

ప్రమీ: అయ్యో! మరల నిట్టియూహల నేల తలంచెదరు?

వీర: భయమనుమాట యెఱుఁగని యీ వీరసింహుఁడు నేఁడు బీభత్స జాగ్రత్స్వప్నములచే విభ్రాంతుఁడగు చున్నాఁడు. ధర్మపాలుఁ డనుభవించు శాంతి నాకు లేదుకదా . . జీవిత జ్వరావేగ విముక్తుఁడై ఆతఁడు సుఖనిద్రపోవుచున్నాఁడు . రాజద్రోహము ఆతని శాంతి ధామమునకు తీసికొనిపోయినది... ఇఁక మీఁద ద్రోహమాత్సర్యములు విషఖడ్గములు ఆతని శాంతి మయసుషుప్తిని భంగ మొనరింపఁజాలవు.

ప్రమీ: మహారాజా! ప్రభుత్వ మంతయు అరచేతిలో నిముడ్చు కొన్న మీ కెవ్వరి వలన భయము?

వీర : ప్రజలు తిరుగుబాటు గావించుచున్నారని వార్తలు వచ్చుచున్నవి. బీమసింగ్ వంచకుఁడు. అతఁడే ఈ విష బీజములను ప్రజలలో రేకెత్తించినవాఁడు. ఈ హృదయ శల్యమును పెకలించి వైచినఁగాని మనకు స్వాస్థ్యము లేదు.

ప్రమీ: భీమసింగ్ అమర్త్యుఁడుకాఁడు .ఆతని జీవిత ప్రతిమ శాశ్వతముకాదు !

వీర : చక్కఁగానాలోచించితివి-ప్రమీలా! చక్కఁగా నాలోచించితివి...అమర్త్యుఁడుకాఁడు .. . . నేఁటిసాయంకాలము వెలుఁగు రేఖలు మాసిన వెంటనే మహాభయంకర కృత్య మొకటి జరుగఁ గలదు ..

ప్రమీ: ఏమది?

వీర : మనోహారిణీ! జరిగినపిదప విని సంతోషించెదవులెమ్ము. అంతవఱకును అతి రహస్యము ఒక్క బాణముతో రెండుపక్షులు కూలిపోఁగలవు. ఈ రక్తావర్తము నన్నులోని కీడ్చుకొని పోవుచున్నది. అధర్మము చేత నారబ్ధములైన కార్యములు పాపము చేతనే బలయుతములు కావలయును! ప్రమీలా! నీవు నీమందిరమునకు పొమ్ము-నేనిప్పుడే వచ్చెదను.

[తెర]

# రాజ్యకాంక్ష

## 9 వ రంగము

[రాజభవనము - ప్రవేశము వీరసింహుఁడు దండనాథులు]

వీర : అసమర్థులగు నధికారవర్గముచే ప్రభుత్వబలము క్షీణించుచున్నది. రాజశాసనములను మీరు తీవ్రముగ నిర్వర్తించియుండినచో పరిస్థితు లింత విషమించియుండవు.

1. దండ : మహారాజా! మూఁడుగంటలకు మీ మరణశాసనమును ప్రకటించితిమి. ఈ నాలుగుగంటలలో ఇరువది మందిని ఉరితీయించితిని.

2. దండ : నేను ముప్పదిమందికి శిరశ్ఛేదము చేయించితిని.

వీర : ఉరితీయించుటయందు మీరింకను నైపుణ్యము సంపాదింపవలయును. రాజద్రోహమునకు స్త్రీపురుషభేదము లేదు - బంధుమిత్రవిచారము లేదు - పుణ్యపాపపరిశీలన లేదు. రాజద్రోహుల కంటినీరు పవిత్రగంగాజలసదృశము. వారి యాక్రందనములు ఆహ్లాదకరము లగు మధురగీతములు!

1. దండ : మహారాజా! ఈ ధర్మసూత్రములను మే మెల్లప్పుడు మనస్సునం దుంచుకొనెదము.

2. దండ : మనస్సునం దుంచుకొనుటయే కాదు. నే నీక్షణము నుండియు కార్యాచరణమున బ్రయోగించెదను.

వీర : మీ రాజభక్తి కొంత యూఱట కలిగించినది. మీ కార్యదీక్ష ముమ్ముందు నాప్రశంసకు పాత్రము కాఁగల దని నమ్ముచున్నాను. సమయమైనట్లున్నది. రణసింగ్ సభకురాలేదు. కారణ మేమైయుండును?

1. దండ : ప్రభూ! నాతో వచ్చెదనని చెప్పెను.

వీర : ఇంతలోనే మనసు మాఱిపోయినదా యేమి? ఆతని ప్రవర్తన సందేహమునకు తావిచ్చుచున్నది. ఎవ రక్కడ ? . .

(ప్రవేశము భటుఁడు.)

రణసింహుని తత్క్షణమే రమ్మని రాజాజ్ఞగా తెలియఁ బఱపుము

(భటుఁడు పోవును)

2. దండ . ఆతఁడు సాయంకాలమువఱకును భీమసింహునితో ఆంతరంగిక సంభాషణలు జరుపుచుండెను.

వీర : ఏమి - మాకు తెలియని రహస్యము లేమైయుండును ? కుట్రలా - కుతంత్రములా - రాజద్రోహమా ?

(ప్రవేశము భటుఁడు)

భటు . ప్రభూ! రణసింగ్ ఊరువిడిచిపోయినాఁడని వార్త.

(భటుఁడు పోవును)

వీర : నిస్సందేహముగా రాజద్రోహము! వాని నెత్తురు కంటితో చూడకవిడువను. . . ఈ విషాంతర్వాహిని ప్రజలనుండి సైన్యమునకు ప్రాకుచున్నది. ఈ ద్రోహికి మఱపురాని ప్రతీకారము చేయవలెను!

1. దండ : ఊరువిడిచిపోయినవానిని మనమేమి చేయఁగలము?

వీర . మీ యూహలకు నేలమీఁది పురుగులకువలె ఊర్ధ్వగమనములేదు. ప్రతీకారము ప్రతీకారము . మీ రిప్పుడేపోయి వాని భవనమును చుట్టుముట్టి తగులఁబెట్టుఁడు. లోనున్న యీఁగకూనయు వెలికిరాకుండ వానివారందఱును మంటలో మాఁడిపోవలెను.

దండ : ఆజ్ఞ.

(దండనాథులు నిర్గమింతురు)

వీర : (స్వగతము) కాలరాక్షసుని కరాళాస్యమున రక్తచ్ఛాయలకుతోడు దహనజ్వాలలు! . .

(ప్రవేశము భీమసింగును చంపవచ్చిన హంత. వీరసింహుఁడు చూచి ఆతురుఁడై)

కార్యము తుద•ముట్టించితివా?

హంత: భీమసింగ్ మెడ నరికేశాను ప్రెబూ.

వీర : ఘనకార్యము చేసితివి. సంతోషము. గొంతులు కోయువారిలో నీ వగ్రగణ్యుఁడవు.

హంత: మారాజుగా రాలా గంటారు గానీ నాకంటె మునగాళ్లున్నారు ప్రెబూ యీవూర్లో.

వీర : భీమసింగ్ కుమారుఁడును నీయాదరణమునకు పాత్రుఁడై యుండినచో, హంతల చరిత్రలో నీపేరు చిరస్థాయిగా నిలిచిపోఁగలదు.

హంత. జయసింగ్ తప్పించుకున్నాడు ప్రెబూ!

వీర : నీకురావలసిన కీర్తిలో సగపాలు జాఱవిడిచితివి !

హంత: నాతో కూడావొచ్చినోడు అంతచెయితిరిగినోడు కాదు ప్రెబూ. పెద్దాయన్ని నేను జూచుకుంటాను- పిల్లోణ్ణి నీవు చూచుకోరా అంటే ఆ అవకతవక యెదవకి చెయివొణికి యేటుతప్పింది ప్రెబూ. పిల్లోడు పిడుగు, వొక్క యేటుతో మావోణ్ణి కూల్చేశాడు.

వీర : అల్పప్రాణము! పోనిమ్ము. భీమసింగ్ మాత్రము స్వస్థుఁడు కదా?

హంత: తలకాయను మొండాన్ని వేరే వేరే. గుంటల్లో పాతేశాను ప్రెబూ మళ్లా లేచిరాకుండా.

వీర : మిక్కిలి జాగరూకత వహించితివి. తలలున్న మొండెములు అపాయకరములు . నీవు కోరిన బహుమాన మిచ్చెదను. (డబ్బు ఇచ్చును)

హంత: మళ్లా యాడన్నా పనిబడితే మరిచిపోకండి ప్రెబూ.

వీర : నీవు పొమ్ము.

(హంత నిష్క్రమించును)

ఈ శుభ వార్త ప్రమీల కెఱింగించెదను. ఎవరక్కడ?
(ప్రవేశము భటుఁడు) ప్రమీలా దేవిని రమ్మని చెప్పుము.
(భటుఁడుపోవును) భీమసింగ్ మరణముతో హృదయము
లోని అగ్ని పర్వత మొకటి ఆర్పి పెకలించి వేసితిని.

(ప్రవేశము ప్రమీల)

ప్రమీలా! భీమసింగ్ హతుఁడు!

ప్రమీ: ఇఁక మీరు నిశ్చింతముగా నిద్రింపవచ్చును.

వీర: (ఆలోచనలో) ఆతని కుమారుఁడు బ్రతికి యున్నాఁడు.

ప్రమీ: పసివాఁడు. అతఁడేమి చేయఁగలఁడు?

వీర: నేను అపుత్రకుఁడను . ఎవరికొఱకు ఈదారుణ రుధిర ప్రపాతము! నా వెనుక నాసింహాసనమును నాశత్రువు లెవ్వ రాక్రమించుకొందురో! వారికొఱకా సుగుణ మూర్తియగు ధర్మపాలుని వధించుట. వారికొఱకా వెలలేని నాయశశ్చంద్రికను శోణితారుణ మొనర్చుకొనుట... వారికొఱకా పవిత్ర మగు నాయంతరంగ మును కలిపురుషునకు బానిసగా నమ్ముకొనుట- నరక సదృశ మొనర్చుకొనుట - - -

(ప్రమీల కంట నీరుపెట్టుకొనుటచూచి)

ప్రమీలా! నిన్ను నొప్పించితినా? నీ హృదయము గాయపడినదా?

ప్రమీ. లేదు.. తగులఁబడిపోయినది.

వీర : ప్రమీలా ! ఊఁటడిల్లుము - ఊఁటడిల్లుము - మనచేతు లతో ప్రయత్నపూర్వకముగా ప్రయోగింపఁబడిన ఈ మారణమహాస్త్రమునకు ఉపసంహారమంత్రిములేదు -

(భీమసింగ్ ఛాయకనఁబడును)

(వీరసింహుఁడు ఉద్విగ్నుఁడగును)

ఎవరది ? . భీమసింగ్. భీమసింగ్! చచ్చియు నీవు మరలఁబ్రతికివచ్చితివా ? రక్తసిక్తమైన నీశిరస్సును నావంకనాడించెద వేల ? నేనా నిన్ను చంపినది ?

ప్రమీ : ఎవ్వరునులేరే ? ఎవరితో మీరు మాటాడుట ?

వీర : చూడుము చూడుము. నీ కగపడుటలేదా ఆ మృత్యురూపము ?ఆ శరీరములో ప్రాణస్పందనము లేదు ఆ రక్తము మంచువలె కరుడుగట్టినది ... చైతన్యరహితములైన ఆకన్నులలో •ఎట్టి భావస్ఫుర ణయులేదు , శూన్యములు . (కన్నులు కప్పుకొని. పోమ్మావల — నికృష్టదృశ్యమా — పోమ్మావల. (ఛాయ అదృశ్యమౌను) అదృశ్యమైనది అదృశ్యమైనది.

ప్రమీ : ఇదియంతయు భ్రాంతికల్పితము.

వీర : నీకు భయముకలుగుటలేదా ?

ప్రమీ : వాస్తవము కాని యీ గాలిబొమ్మలను చూచి మీరు భయపడుట నా కచ్చెరువుగొలుపుచున్నది.

వీర : గాలిబొమ్మలా... కల్పితరూపములా ! !

ప్రమీ : ఔను. ఆనాడు మీకు గాలిలోకనఁబడిన కృపాణము నిజమైనదా ?

వీర : కాదు .. కాని ఈ యశరీరరూపముల యెదుట అకుంఠితమైన నా బాహుబలము తృణీకరింపఁబడు చున్నది. నా హృదయము స్తంభించుచున్నది .. ఆ మృత్యురూపముగాక మఱి యే నరకంఠీరవాకారము దాల్చి వచ్చినను నాకు భయములేదు. .అది పరలోక భయంకరము.. అది మహాపాతకము ఘనీభవించిన ప్రతిమ!

(ప్రవేశము దండనాథుఁడు)

1. దండ : మహారాజా ! ఆజ్ఞ నిర్వర్తించితిమి. ఆ ద్రోహికి సర్వనాశన మైనది. గూఁటిలోనిపక్షులవలె వానివా రందఱును మంటలో మాఁడిపోయినారు.

వీర : వారిని కాల్చివేసిన మంటలు నాకు కొంచెము తాపోప శమనము చేసినవి! ...

ప్రమీ: ఏమి జరిగినది?

వీర : రణసింగ్ నన్ను వంచించి ప్రాణములతో తప్పించుకొని పోయినాఁడు. వానిగృహము స్త్రీ పురుషులతో బాల వృద్ధులతో భస్మ మొనరింపఁబడినది.

ప్రమీ: అయ్యో! ఆతని భార్య గర్భవతి. ఆతనికి పసిబిడ్డ లున్నారే...

వీర : అగ్నిహోత్రుని కంటఱు సమానులు!

ప్రమీ. నాథా! నా కస్వస్థతగానున్నది. కన్నులు తిరుగుచున్నవి.

వీర : భయములేదు: వైద్యుని బిలిపించెదను. ఎవరక్కడ?

(ప్రవేశము భటుఁడు. జనసంకుల కోలాహలము వినిపించును)

1 దండ: జన సమూహములు వీధులలో తిరుగుచున్నవి. రాజ భవనమువైపు వచ్చుచున్నారు.

వీర : ఎచ్చట వారి నచ్చటనే కాల్పింపుము - ప్రమీలా భయపడకుము. (భటునితో) పరిచారికనురమ్మనుము. (భటుఁడుపోవును) నగరద్వారములను మూసివేయుఁడు. నాయాజ్ఞ లేనిది లోని కెవ్వరును రాఁగూడదు - వెలి కెవ్వరును పోఁగూడదు. (ప్రవేశము రోహిణి) ప్రమీలను తీసికొనిపొమ్ము (దండనాథునితో) పరిస్థితులు శాంతించు వఱకును పట్టణమంతయు చెఱసాల.

దండ : ఆజ్ఞ.

వీర . ఈ రాత్రి ప్రభుత్వస్థానము మణిదుర్గమునకు మార్చి వేయవలయును. ఇది రహస్యముగా జరుగవలసినది.

దండ : ఆజ్ఞ.

వీర : సైన్యములు ప్రతిక్షణయుద్ధసన్నద్ధములుగా నుండ వలయును.

దండ : ఆజ్ఞ.

(దండనాథుఁడు నిష్క్రమించును వీరసింహుఁడు అలసిపోయి బాధ నభినయించును)

వీర : ఏనిమిషమున కేమి జరుగనున్నదో తెలియరాకున్నది. మానవులకన్నులకు అజ్ఞానపుఁదెరనుగట్టి విధి వంచించుచున్నాఁడు. క్షణకాల మీ కాలయవనికను తొలఁగింపఁ గలిగినచో. ..

(శబ్దము) ఎక్కడిదీ శబ్దము ?
(శబ్దము వచ్చినవైపు చూచుచుండఁగా మొదట యుద్ధరంగమున అతని శిబిరములో నగపడిన భూతము స్పష్టరూపము ధరించును)
ఇది యుద్ధరంగము కాదు! నీ విచ్చటి కేలవచ్చితివి?

భూతవాక్కు : నేను నిన్ను వెన్నాడు విధిని.

వీర : ఏమి! నన్ను వెన్నాడు విధిస్వరూపమవా ? అట్లైన వీరసింహునికి మరణ మెప్పుడు ?

భూతవాక్కు : శైలారణ్యము మణిదుర్గమునకు వచ్చువఱకును నీకు మృత్యుభయము లేదు. అయోనిజుఁడు గాని నిన్ను చంపలేఁడు.

వీర : శైలారణ్యము మణిదుర్గమునకు వచ్చువఱకును నాకు మృత్యుభయములేదు అయోనిజుఁడుగాని నన్ను చంపలేఁడు - శుభసందేశము తెచ్చితివి! (మరల భూత రూపమువంకఁ జూచునప్పటికి అది అదృశ్యమగును) . ఏమి! ఎంతలో మాయ మైనది! శైలారణ్యము మణిదుర్గ మునకు వచ్చువఱకును నాకు మృత్యుభయము లేదు- అయోనిజుఁడుగాని నన్ను చంపలేఁడు... అరణ్యములు కదలివచ్చు టేమి? స్త్రీగర్భమున పుట్టనివాఁ డెవఁడు?.. ప్రకృతిశాసనములు నా కొఱకై విపరీతస్థితిని చెందవు కదా— ఇఁక ప్రపంచమునకు వెఱవను. (వికటహాసము జనసంకుల కోలాహలము) . ఈఁగలు - దోమలు - మంటలోని కుఱుకుచున్న శలభములు! - మృత్యు భయము లేదు!

[ తెర ]

# రాజ్యాకాంక్ష

## 10 వ రంగము

[శైలారణ్యములో ఒక కొండగుహాముఖము -

ప్రవేశము యువరాజు సభ్యుడు]

యువరా: పాపము పరిపక్వ మగుచున్నది. ఈ భయంకర నియంతృత్వ మంతరించు సమయ మచిరకాలములోనే రాగలదు.

సభ్యు: ఐనను వీరసింహుడిట్టి ఘాతుకమృగముగా మారి పోవునని నేనూహించియుండలేదు.

యువరా: దురాశాపిశాచము తలనెక్కి తాండవించు చున్నది. ప్రజలు నానాటికి వినిపించుగాథలు హృదయభేదకము లుగా నున్నవి. నాప్రజానీకమున కెన్నటికో విముక్తి!

(ప్రవేశము భటుడు)

భటు: ప్రభూ రణసింగ్ వచ్చియున్నారు.

యువరా: రణసింగ్!

భటు: చిత్తము. తనసైన్యదళముతో వచ్చియున్నారు.

యువరా: రమ్మనుము. (భటుడు పోవును) ఏమి, విస్మయముగా నున్నది! వీరసింహునికి కుడి భుజముగా నుండిన రణ సింగ్ ఇచ్చటికి వచ్చుటేమి! ఇందులో గూఢార్థమేమి

కలదో! మనము జాగరూకులమై మెలఁగ వలయును. రాజ ద్రోహము ఎన్ని రూపములనైనను తాల్పఁ గలదు.

(ప్రవేశము రణసింగ్)

రణ: మహారాజా! అభివాదనములు.

యువరా: రమ్ము రణసింగ్! రాజ్య భ్రష్టుఁడనై అడవులలో కొండగుహలలో సన్యాసివలె జీవయాత్ర గడపుచున్న నాకు మహారాజ బిరుదమెందులకు? పరిహాసమునకైనను సమయాసమయములు లేవా?

రణ: క్షమింపుఁడు. నేను పరిహాస మొనర్చుటకై వచ్చి యుండలేదు. వంశానుగతముగా రాజ్యము మీదిగాక మఱి యెవ్వరిది కాఁగలదు! రాహుగ్రస్తమైన చంద్ర బింబము కాలానుసరణముగా గ్రహణముక్తమై పరి పరిపూర్ణ తేజస్స్ఫూర్తితో వెలుఁగొందఁగలదు.

సభ్యు: వీరసింహుఁడు కుశలముగ నున్నాఁడు కదా.

రణ: రాజ్యములోని ప్రాణములన్నింటిని దిగమ్రింగుచు మిక్కిలి కుశలముగ నున్నాఁడు.

సభ్యు: ఏమి-రాజ్యమంతయు ఆతని వశమై యుండలేదా?

రణ: రాజ్యము - రాజ్యము కాదది—రౌరవము! - మాతృ భూమి కాదది—ప్రజలకది శ్మశానవాటిక! ధర్మపాలుని వధతో ఆరంభమైన మృత్యుయజ్ఞ మింకను ఆహుతి కెదురుచూచుచున్నది.

యువరా: ఇంకను రాజరక్త మపేక్షించుచున్నది కాంబోలు.

రణ: వీరసింహుని రక్తపిపాసకు ప్రభుప్రజాభేదము లేదు.

యువరా: ఏమి, వీరసింహుని ప్రభుత్వ మంత హింసామలినమై యున్నదా?

రణ: నాకన్నులతో ఆ దృశ్యములను చూడఁజాలకే యిచ్చటికి వచ్చితిని. అమాయికులైన ప్రజలు వేలకు వేలు బంధితులై వధ్యశిలకు బలియగుచున్నారు. ఎచ్చట చూచినను రక్తపాతమే-ఎచ్చటవిన్నను ఆక్రందనములే! ప్రజలు యువరాజురాకకై ప్రతీక్షించుచున్నారు. పట్టణప్రాంతముల మీారగపడిన చాలును. మీాకై ప్రాణము లర్పించుటకు సంసిద్ధులై యున్నారు. ఈ యపవిత్ర ప్రభుత్వమునుండి ప్రజలను రక్షించుట మీాకు ధర్మముకాదా?

యువరా: ప్రజ లెట్టి విమర్శహీనులు! వీరసింహుని కంటెను నేను మేలని తలంచిరి కాంబోలు!

రణ: వీరసింహుని యందు మానవత్వము నశించిపోయినది. ఆతఁడిప్పు డొక రాక్షసుఁడు.

యువరా: నాయందింకను కొంత మానవత్వము శేషించియున్న దని వారికి భ్రాంతి. రణసింగ్! ఈ కఠోరసమయమున ఆత్మవంచన మెందులకు? నాయథార్థ ప్రకృతి నీ వెఱుఁగవు. నాయధికార తృష్ణకు అంతములేదు. నాధనాశకు

పరిమితిలేదు. నాసుఖవాంఛలకు హద్దులులేవు. రాష్ట్రాధికారులను కాలిక్రిందిపురుగులవలె నలిపివేసెదను. ప్రజల ధనము కొల్లగొట్టి నాబొక్కసము నింపుకొనెదను. పట్టణములోని స్త్రీలను చెఱపట్టి నాయంతఃపుర కాంతలను గావించుకొనెదను. ఇది నా యథార్థస్వరూపము. ఇట్టివాఁడు రాజ్యపాలనకు అర్హుఁ డని నీ వూహింపఁగల వా?

రణ : (ఉద్రేకముతో) ఛీ - అట్టివాఁడు రాజ్యపాలనకుఁగాదు- జీవించుటకై నను అర్హుఁడు కాఁడు. ధర్మపాలునికడుపున నీవంటినీచుఁడు జన్మించియుండుట మా దురదృష్టము. యువరాజా! నేఁటితో నీకును నాకును ఋణముతీరినది.

ప్రజాహితముఁగోరి ప్రాణములకు తెగించి ప్రాణసమానులైన భార్యను బిడ్డలను విడిచిపెట్టి కొండంత ఆశతో నీయొద్దకువచ్చితిని-నాయాశలు నిరాశలైనవి ... రాజ్యమెట్లుపోయిననేమి? సెలవు . రణసింగును ప్రాణములతో మీరింక చూడలేరు ..

యువరా : రణసింగ్! క్షమింపుము. నీయంతరంగము పరిశుద్ధమైన దని మా కిప్పుడు స్పష్ట మైనది.

రణ : నన్ను రాజద్రోహియని శంకించితిరి కాఁబోలు!

యువరా : రణసింగ్! మా ప్రాణములను మేము కాపాడుకొనవలయునుగదా! ఇచ్చటికి వచ్చువారిలో మిత్రు లెవ్వరో శత్రులెవ్వరో మాకెట్లు తెలియఁగలదు?

రణ : నన్ను చక్కఁగా పరీక్షించితిరి. మీ దూరదృష్టికి నా ధన్యవాదములు. ఈ క్షణమునుండియు మీ సేవకుఁడను.

యువరా : నీకు కొన్ని ముఖ్య వార్తలు చెప్పవలయును. ఇచ్చట మేము కొన్ని సైన్యదళముల నేర్పాటుచేసితిమి. మా తండ్రికి ఆప్తమిత్రుఁడైన కాశ్మీరప్రభువు తన సైన్యములను సహాయము పంపెదనని వాగ్దానము గావించియున్నారు. ఆ సైన్యములు రేపే యిచ్చటికి రాఁగలవు. రెండుదినములలో మనము పట్టణము ముట్టడింపవలయును.

రణ : ప్రభూ! ఈ సంతోషవార్తలు విని పోయినప్రాణములు తిరిగివచ్చినవి. వీరసింహుఁడు పండుటాకువలె నేల రాలుటకు సిద్ధముగానున్నాఁడు.

(ప్రవేశము జయసింగ్ రక్తసిక్తవస్త్రములతో)

యువరా : ఎవరది?. .జయసింగ్ .
ఎక్కడిదీ రక్తము? ఏమిజరిగినది?

జయ : —ఈ రక్తము నాదికాదు నా తండ్రిది ..

యువరా : అయ్యో, భీమసింగ్ హత్య. వీరసింహుఁడు...

జయ : కాదు. ఆతఁడెదుటఁబడియుండినచో వాని నెత్తురు త్రావక విడిచియుండెడివాఁడను కాను. ఆతనికొలువులో నేఁ డగ్రస్థానములు వహించియున్న హంతల కార్య మిది! దొంగవలె హంత లను ప్రేరించి చంపించినాఁడు.

యువరా . జయసింగ్! ఈ యాపత్సమయమున నేను నీకేమి యూఱటకలిగింపఁగలను. ఐనను ధైర్యమును వీడకుము. మనమిరువురము దుఃఖములో సహోదరుల మైతిమి.. ! ప్రతీకారమునఁగాని క్రోధము చల్లారదు.

జయ : నీమనస్థైర్యము నాకు ఆదర్శముకాఁగలదు. (రణసింహునిచూచి) రణసింగ్! ని న్నేమనవలయునో తెలియకున్నది?

రణ : ఏమి ?

జయ : నీ వొక్కఁడవే వచ్చితివికదా ?

రణ : లేదు. నాసైనికదళముతోవచ్చితిని.

జయ : ఊఁ - నీ దేశభక్తిని ప్రశంసింపవలయునో నడిసముద్ర మున భార్యను, బిడ్డలను విడిచివచ్చిన నీ క్రౌర్యమును నిందింపవలయునో తెలియకున్నది.

రణ : ...నేనేమిచేయఁగలను? పరిస్థితు లట్టివి. నీవు వారిని చూచివచ్చితివా? ఆ రాక్షసునిదృష్టి వారిమీఁద ప్రసరింపలేదుకదా? వారు కుశలముగానున్నారా?

జయ : .. ఊఁ. .

రణ : (ఆతురుఁడై దగ్గఱకువచ్చి) ఉన్నమాట చెప్పుము

జయ : నాకు తెలియదు - నన్నడుగకుము -

రణ : (అర్థము చేసికొని) పట్టణములో జరుగుచున్న ప్రజాహింసను చూచిచూచి ఈ హృదయము శిలాకరినమైపోయినది. దీనిలో శోకమోహములకు చోటులేదు. నీ వేమిచెప్పినను నాకు బాధలేదు.

జయ : నా నోటితో ఆవృత్తాంతమును వచింపఁజాలను.

రణ : ఆపాపము నీదికాదు.

జయ : నీ భవనము తగులఁబెట్టఁబడినది... నీకుటుంబము ..

రణ : నా పసిబిడ్డలు

జయ : ఔను ..

రణ : నా భార్య..

జయ : భార్య బిడ్డలు సేవకులు ఉన్నవారందఱును ..

రణ : ఓరికిరాతుఁడా! ఒక్క పెట్టున సర్వశూన్యముచేసితివా? వారు నీ కేమి యపకారము చేసిరి? తప్పునీదికాదు... పాపి! రణసింగ్! నీమూలకముగ కదా నీవారందఱును ధ్వంసమైపోయిరి.

యువరా : నాప్రజ లిట్టిదారుణముల ననుభవించుట చూచియు నేను జీవించుటెందులకు? రణసింగ్, ఇదిగో ఖడ్గము. ఈ హృదయమును చీల్చివేయుము. నీపసికూనలతో నేనును వీరస్వర్గమునకు పోయెదను!

రణ : యువరాజా ! ఎవరేమిచేయఁగలరు ...
నా పసిపిల్లలు - నాభార్య మాతృభూమికి బలి .
వీరసింహునికి బిడ్డలులేరు ! !

(ప్రవేశము భటుఁడు)

భటు : ప్రభూ ! కాశ్మీరసైన్యములు వచ్చిచేరినవి. వారి రాయబారివచ్చియున్నాఁడు.

యువరా : మంచిది. మేము కలసికొందుమని చెప్పుము.

(భటుఁడు పోవును)

రణసింగ్, ప్రతీకారము క్షణక్షణము ముందడుగు వేయుచున్నది.

రణ : దుఃఖములో సంతోషము... జీవితరహస్యమును భేదించుట అసాధ్యము వీరసింహునికి బిడ్డలులేరు ! !

యువరా : రండు పోవుదము. రేపు ఉదయముననే మనము కదలిపోవలయును. మన జీవిత చరిత్రలో నూతనాధ్యాయము ప్రారంభ మగు తరుణము సమీపించినది.

[ తెర ]

# రాజ్యకాంక్ష

## 11వ రంగము

[మణి దుర్గము - ప్రమీల నిద్రించు గది ప్రక్కన
ప్రవేశము - వైద్యుడు]

వైద్యు: ఈ మణి దుర్గంలో మునుపటి కళా కాంతులులేవు. పాడుపడిన దేవాలయంవలె చీకట్లు ముసురుకొంటున్నవి. ఊపిరి పీల్చుటకైనా గాలిలేదు.. ...రాణిగారి అస్వస్థతకు కారణం తెలియలేదు.

(ప్రవేశము రోహిణి)

రోహిణీ! రాణిగారు మందుతీసుకొన్నారా?

రోహి: బలవంతంజేసి తాగించానండి. నాకేమి జబ్బులేదు, వొద్దంటే వొద్దని పట్టు బట్టారు. తిన్నగా ఆమాటా యీమాటా చెప్పి యెట్లాగో చివరకు తీసుకునేటట్లు చేశానండి.

వైద్యు: ఆమందుతో రాత్రంతా గాఢంగా నిద్రపోతారు. కొంచెము నెమ్మతికలుగుతుంది.

రోహి. రాణిగారి వ్యాధి నిజంగా నిద్రలేక పోవడం కాదండి. పగులంతా యెవ్వరితో మాట్లాడకుండా వొంటరిగా గదిలో కూర్చొని వుంటారు. చీకటిపడిందంటె మన

ప్రపంచంలో వుండరండి. నడిరాత్రి అంతా మాటుమణిగే టప్పటికి నిద్రపోతూనే పడకనుండిలేచి యేమేమో మాట్లాడు కుంటూ తిరుగుతుంటారండి.

వైద్యు: నీవుబాగా చూచావా? తిరిగేటప్పుడు నిద్రపోతూనే తిరుగుతారా?

రోహి: నేను బాగాచూచానండి. నిన్నరాత్రి నిద్రపోతూనే లేచికూచోని కాగితం కలం తీసుకొని యేమేమో రాశారు, చదువుకున్నారు. కాగితాన్ని మడిచి బాగా లక్కఅంటించి ఆమైన వొచ్చి పడుకున్నారండి. ఇదం తానిద్రలోనే జరిగిందండి. నేను ప్రక్కనే వున్నప్పటికి వారికి తెలియలేదండి.

వైద్యు. ప్రకృతివైపరీత్యం-ఆశ్చర్యంగావుందే! నిద్రించుచుండడమూ, మేల్కొన్నవారు చేయగల పనులన్నీ చేయుడము! రోహిణీ! నీవు ఎప్పుడూ రాణిగారితోకూడానే ఉన్నావుకదా, వారు మాట్లాడే మాట లేమన్నా విన్నావా?

రోహి: విన్నానండి.

వైద్యు: ఏమ్మాట్లాడు తుంటారు?

రోహి: అమ్మో - విన్నానుగాని ఆమాటలు నేను చెప్పనండి.

వైద్యు: నేనువైద్యుణ్ణి- నాతో చెప్పడానికి భయమెందుకు?

రోహి: అమ్మబాబో - నేంచెప్పనండి! రాణీగారు యేమేమో మాట్లాడుతుంటారు! . .. (ప్రమీల నిద్రించు గదివైపు చూచి) అదుగో అదుగో రాణిగారిటేవస్తున్నారు.

(ప్రవేశము ప్రమీల- చేతిలో మైనపుదీపమును పట్టుకొని రెప్ప లార్పక నేరుగా చూచుచు తిన్నగా నడచును)

వైద్యు: ఆమెచేతిలోకి దీప మెట్లావచ్చింది?

రోహి: ప్రక్కన దీపం యెప్పుడూ వెలుగు తుండాలని రాణిగారి ఆజ్ఞ.

వైద్యు: ఆమె కన్నులు తెరుచుకునేవుంది?

రోహి: కాని చూపులేదు.

(ప్రమీల దీపమును ప్రక్కబల్లమీఁద పెట్టి, చేతులు రాచుకొనును)

వైద్యు: అదేమి చేతులను ఆవిధంగా రాచుకుంటున్నారు?

రోహి: అట్లాగే చేస్తుంటారండి. చాలా మార్లు చూచానండి చేతులు బాగారాచి కడుక్కుంటూ వుండడం.

ప్రమీ: (చేతులు చూచుకొని) రక్తబిందువులు ...... ఒకటి .. రెండు .. . . .మూఁడు ......

రోహి. అదుగో మాట్లాడుతున్నారు.

వైద్యు. ష్ .. (కాగితము తీసి వ్రాసికొనుట అభినయించును)

ప్రమీ: నరకములేదా ... వెఱ్ఱికలలు . మహావీరుఁడవు... నీపౌరుషము పరిహాసాస్పదము. . హత్యాకారకులు వారే కావలయును కాదనుట కెవరికి గుండెకలదు?

వైద్యు: విన్నావా ?

రోహి: అనగూడనిమాటలంటున్నారు. ఆ మాటల్లో అర్థం
వారికే తెలియాలి.

ప్రమీ: ... కాని, ఆవృద్ధ రాజు శరీరములో అంతనెత్తురున్న
దని యెవరికి తెలియును....

(వైద్యుడు రోహిణి సాభిప్రాయముగా ఒకరి నొకరు చూచు
కొందురు).....

ఆతని భార్య గర్భవతి . ఆతనికి పసిపిల్లలున్నారే...
(చేతులు వాసన చూచి) రక్తగంధము నందనపారి
జాత పరిమళములు సైతము ఈ దుర్గంధమునడచి
వేయజాలవు . (నిట్టూర్పు)

వైద్యు: ఆ నిట్టూర్పు హృదయాన్ని చీల్చుకొని వచ్చినట్లుంది!

ప్రమీ: ప్రియా! అట్లుచూచుచు నిలబడెద వేల? రమ్ము
చేతులు కడిగివేసెదను... శబ్దము . ఇక్కడ మనము
ఉండరాదు ... రమ్ము...రమ్ము...రమ్ము

(ప్రమీల నిష్క్రమించును)

వైద్యు: ఇప్పు డెక్కడికి పోతారు?

రోహి : నేరుగా తనగదికెళ్ళి పడుకుంటారు.

(గంట వినిపించును రోహిణిపోవును )

వైద్యు : (జాలిగా) పాపం ప్రమీలాదేవి సంపాపం చేసిందో! దానికి ఇక్కడనే ఫలమనుభవిస్తున్నది. 'అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫల మశ్నుతే" అను పెద్దల వచనము యథార్థం! విపరీతకర్మలకు విపరీతశిక్ష!

(ప్రవేశము వీరసింహుడు)

మహారాజా! మీరింకను నిద్రింపలేదా!

వీర : . నిద్ర. .నిద్ర పిచ్చివైద్యుడా!మహారాజుల జీవిత రహస్యములు నీ కేమి తెలియును . . మహారాజులు పగలు నిద్రించి రాత్రి గుడ్లగూబలవలె మేల్కొని యుందురు. మేల్కొనియే నిద్రించుచుందురు-నిద్రించుచునే మేల్కొనియుందురు!

వైద్యు : ఈ విపరీతస్థితి మా శాస్త్రాల్లో ఎక్కడా వివరింపబడి యుండలేదు.

వీర : మీ శాస్త్రములు ప్రాతపడిపోయినవి. నీవు క్రొత్త శాస్త్రము వ్రాయునప్పుడు ఈ రహస్యమునుపయోగించుకొనుము . ప్రమీల కెట్లున్నది?

వైద్యు : శ్రద్ధగా పరీక్షించాను. ఆమె జాడ్యం సామాన్యమైంది కాదు.

వీర : సామాన్యులకు సామాన్యజాడ్యములు -మహారాజులకు రావలసిన జాడ్యములు అసామాన్యములుగనే యుండవలయును . కారణము బోధపడినదా?

వైద్యు : ఆలోచిస్తున్నాను-ప్రభూ!

వీర : రోగి బ్రతికియుండఁగనే నీ యాలోచన పూర్తికావల యును గదా!

వైద్యు : నిజము . నిజము - ఆవల ఆలోచించినా ప్రయోజన ముండదు.

వీర : ఆమాత్రము గుర్తింపఁగలిగినవాఁడవు నీవు వైద్య శిరోమణివి.

వైద్యు : రాణిగారివ్యాధి శరీరానికి సంబంధించిందిగా లేదు. వారిబుద్ధి స్వాధీనం తప్పియున్నది. అంతరాంతరములలో ఎక్కడనో అడచియుంచిన సంభక్షోము గట్టుకోసికొని పొంగివచ్చు ప్రవాహంవలె మనస్సును ముంచివేసి వైకల్యమును కలిగిస్తున్నది.

వీర : దానిని మాన్పుటకే ఔషధము . దానిని మాన్పుటకే ఔషధము! మనఃఫలకముమీఁద అతినిశితముగా లిఖింపఁబడిన వ్యసనాక్షరములను తుడిచివేయఁగల యౌషధము.. హృదయములోని విషమాలిన్యమును పరిశుభ్రముగ సంక్షాళన మొనర్పఁగల యౌషధము... ... భయభ్రాంతులను దుస్స్వప్నములను అడఁచివేసి స్వర్గతుల్యమగు సుఖనిద్ర నొసఁగఁగల యౌషధము.

వైద్యు : మహారాజా

వీర . హిమాలయములోని ఏ రహస్యమూలికలో, భూగర్భమున ప్రవహించు ఏ నదీజలములో, మణిమంత్రౌషధము లెట్టివె నను

వైద్యు : ప్రభూ ! మాయౌషధములు శరీర వ్యాధులను మాత్రమే నివారింపగలవు.

వీర : తుచ్ఛములు. ఈ యపవిత్రశల్యపంజరమునకు - మాంస పిండమునకు - ఔషధము లెందుకు - ఔషధములు !

వైద్యు : ప్రభూ! ఈ మానసిక వ్యాధులకు ఎవరికివారే ఔషధం నిర్ణయించుకోవలసివుంటుంది. నాకేమి తోచడంలేదు. పరమేశ్వరునికృప !

వీర : నీ మందులను ఆకందకములో పాఱవేయుము.

(ప్రవేశము భటుఁడు)

ఏమివార్త ?

భటు : గూఢచారులు తమకై కార్యస్థానంలో వేచియున్నారు. శత్రుసైన్యములు ఐదుమైళ్ళలోనున్నవని వార్త.

వీర : ఇప్పుడే వచ్చెదను. (భటుఁడు పోవును) ఆ శత్రుసైన్యములను మటుమాయము చేయుటకు ఔషధము కావలయును.. ఔషధము కావలయును

(నిష్క్రమించును)

[ తెర ]

# రాజ్యకాంక్ష

## 12వ రంగము

[శైలారణ్యమున ఒక ప్రదేశము. ప్రవేశము యువరాజు రణసింగ్, భటులు]

యువరా : రణసింగ్, అరుణోదయ మైనది. ఈదినమే నూతన యుగప్రారంభము. సూర్యాస్తమయముతో వీరసింహు ని ప్రభుత్వ మంతరింపవలయును.

రణ : ప్రభూ! మన సైన్యములు ఉత్సాహభరితములుగా నున్నవి. వారి హృదయములందును మన హృదయము లందును ఒక్క టేస్థిరనిశ్చయము ధ్రువతారవలె ప్రకా శించుచున్నది—అది వీరసింహుని పతనము.

యువరా : అన్నియు శుభసూచకములు. వీరసింహుని సైన్య ములు అతని యధికారబలమునకు వెఱచి అతని పక్ష మున నున్న వే కాని, వానికి మనయెడలనే సానుభూతి. వీరసింహుఁడు మణిదుర్గమున సర్వవిధ సన్నాహములు చేసియుంచెనని విని యుంటిమి. మన సైన్యధాటికి మణిదుర్గము గాజుపెంకువలె బద్దలై పోఁగలదు.

(ప్రవేశము జయసింగ్)

జయసింగ్, గూఢచారు లేమైన వార్తలు తెచ్చిరా?

జయ : ప్రభూ! వీరసింహునిగూర్చి విపరీతగాధలు వినవచ్చు చున్నవి. కొంద ఱాతనికి మతి భ్రమ కలిగినదను చున్నారు. కొంద ఱాతఁడు పశ్చాత్తాపముతో కుమిలి పోవుచున్నాఁ డనుచున్నారు. కొంద ఱాతని శౌర్య స్థైర్యములు రేపు చూడఁగలమనుచున్నారు.

యువరా : ఎట్లైనను మన విధ్యుక్తధర్మమును మనమునిర్వహింప వలయును. జయాపజయములు దైవాధీనములు.

జయ : నగరద్వారములు మూసివేయఁబడినవి. బోనులో చిట్టెలుకలవలె ప్రజలు మనరాకకై నిరీక్షించు చున్నారు.

యువరా : రేపుసూర్యోదయముతో పట్టణములో ధర్మపాలుని పతాకము స్వాతంత్ర్యజ్యోతులను వెదచల్లఁగలదు .. రణసింగ్, కాశ్మీరసైన్యములు క్రొత్తవి. పట్టణము చేఁజిక్కినపుడు మన ప్రజలకెట్టి బాధలును కలుగనీయ రాదని వారిదండనాథులకు నాయాజ్ఞగా తెలుపుము.

రణ : తప్పక తెలిపెదను.

జయ : ప్రభూ ! మన సైన్యములసంఖ్య ముందుగా వీరసింహు నికి తెలియకుండుట శ్రేయస్కరము.

రణ : నిజము - ఏమియుపాయము ?

యువరా : నాయూహా కేమందురు ?

రణ : ఏమి ?

యువరా : ప్రతిసైనికుఁడును శైలారణ్యములోని పెద్ద చెట్టు కొమ్మను ముందు అడ్డముగా పెట్టుకొని నడిచినచో అరణ్యమే కదలివచ్చినట్లగపడును. మన సైన్యముల సంఖ్య గుర్తింపరాకయుండును. వీరసింహుఁడును ఆతని సైన్యములును భయభ్రాంతములు కాఁగలవు.

రణ : అద్భుతముగానున్నది మీయుపాయము. ఈ కార్యము నేను నిర్వహించెదను.

యువరా : సూర్యోదయము వేళకు పట్టణము చేరవలయును. రండు.

(నిష్క్రమింతురు)

[ తెర ]

# రాజ్యకాంక్ష

## *13* వ రంగము

[మణి దుర్గము – కోటపై భాగము – ప్రవేశము వీరసింహుఁడు, దండనాథుఁడు, కుమార్]

వీర : ... కృతఘ్నులు — పిఱికిపందలు ... వెన్నెముక లేని యాపురుష వేషధారులను ఆహంత పాదధూళిలో పొఱలాడనిమ్ము! మించిపోయినది లేదు.

దండ : ప్రభూ! దుర్గ ప్రాకారములమీఁద మనపతాకములు మంగళద్యోతకములుగా వెలుఁగుచున్నవి.

వీర : మంచిది – ఆ పతాకములకు మన ప్రాణవాయువులే పరిభ్రమణ కారణములు.

దండ : దుర్గమంతయు ఒక్క అంగుళము చోటైనను విడువఁబడక సైనికులతో నిండియున్నది.

వీర : మంచిది – ఈ నాఁడు మనదుర్గము మణిదుర్గము కాదు – వజ్రదుర్గము కందకముమీఁది వంతెన యెత్తి వేయఁబడినదా?

దండ : చిత్తము – ప్రథమ సంఘర్షణమునకు సర్వమును సంసిద్ధముగా నున్నది.

వీర : రానిమ్ము. రానిమ్ము ముట్టడించిన సైన్యములు అడవులలో తిండిలేక ఆఁకలితో కృశించి నశించి పోవలసినదేగాని నా ప్రాణము లుండు నంతవఱకును దుర్గము వారి వశముకాదు.

(దండనాథుఁడుపోవును ప్రవేశము భటుఁడు)

భటు : (భయముతో) ప్రభూ!

వీర : తెల్లపోయిన నీముఖమే నీ సందేశమును చాటుచున్నది. —ఏమివార్త?

భటు : ప్రభూ! పదివేలు

వీర : కాకులు—గ్రద్దలు—ఏమిపదివేలు?

భటు : సైన్యములు ప్రభూ!

వీర . పో మ్మావల. కుమార్! నా కవచమును సిద్ధము చేయుము.

కుమా . ప్రభువులు త్వరపడుచున్నారు. పట్టణ మింకను ముట్టడింపఁబడలేదు.

వీర : కవచమును సిద్ధముగా నుంచుము.

కుమా . ఆజ్ఞ. (కుమార్ పోయి వచ్చి తన స్థానమున నిలువఁబడును)

వీర . పదివేలసైన్యములు—ఈ సంఘట్టనముతో అంతయు తేలిపోఁగలదు. హృదయములోని వ్యాధి లేక పోయి నచో పదివేలుకాదు శతసహస్రము లెత్తి వచ్చినను

అవలీలగా నెదుర్కొనియుందును . హృదయములోని వ్యాధి!.....చిరవయోభారముచే జీవితము క్రుంగిపోవు చున్నది...కడచిపోయినది జీవిత వసంతము .ఇంక తిరిగిరాదు... హేమంత పాండురచ్ఛాయ లలము కొన్నవి...శత్రుసంహారము గావించి ఆకట్టైమోపుకిరీట మును నెత్తిపై పదిలపఱచుకొన్నను అదియంతయు వృధారభసము—మనస్సున కాహ్లాదము కలిగింప నేరదు ఆంతరంగిక మిత్రులు లేరు. యశఃకీర్తులు లేవు. ప్రజల భక్తి గౌరవములు లేవు. వెలికి రానీయకలోనడం చిన వారి శాపవాక్యములు నా కర్ణములయందు ప్రతి ధ్వనించుచున్నవి. నారాజత్వము శవజాగరణమైపోయి నది. (తుపాకి కాల్పులు) కుమార్! నాఖడ్గము—

(కుమార్ ఖడ్గము నందించును.

(ప్రవేశము దండనాథుఁడు)

దండ : పట్టణము ముట్టడి ప్రారంభ మైనది. గూఢచారులు తెచ్చినవార్త లన్నియు స్థిరపడినవి.

వీర : భయములేదు .. శత్రువులును మనుష్యమాత్రులే . ... భయము లేదు. సైనికులలో ఎవ్వఁడైనను భయ మను మాట పలికినచో తత్క్షణమే కాల్చివేయుము. నా శరీరములో కడపటి రక్తబిందువు చిందువఱకును పోరాడెదను!

(జనసంకుల కోలాహలము)

ఏమది ఆ జన ఘోషము?

దండ : నేను చూచి వచ్చెదను.

వీర : వీధులలో ప్రజ లొక్క-పురుగైనను తిరుగరాదని ఆజ్ఞా పింపుము. కనఁబడిన వారిని కనఁబడినట్లే కాల్పింపుము.

(దండనాథుఁడు పోవును)

కుమార్! నా శిరస్త్రాణము—

(శిరస్త్రాణమును ధరించుచు)

ఆ ప్రజానీకము నాప్రాణములకై పరితపించుచున్నది. మూర్ఖులారా! మీకంఠము లెండిపోయి రక్తనాళములు తెగిపోవలసినదేకాని వీరసింహుఁడు ప్రాణములతో మీకుఁ జిక్కఁడు. ... నా ప్రాణములను విధి తన పిడికిటిలో నుంచుకొని కాపాడుచున్నది. శైలారణ్యము మణిదుర్గమునకు వచ్చువఱకును నాకు మృత్యుభయము లేదు!!

(తెరలో స్త్రీరోదన శబ్దము)

కుమార్! ఏమావికలారవము?

కుమా. (చూచి) రోహిణి యేడ్చుచు వచ్చుచున్నది.

వీర : కుమార్! నా పంచేంద్రియములును జీవరహితములై పోయినవి...ఒకానొకనాఁడు అట్టి నిశారోదనము చెవి సోఁకినంతనే హృదయరక్తము చల్లపడిపోవుచుండెడిది. విషాదకరమైన కథామాత్రమును విన్నంతనే శరీర

మంతయు పులకాంకిత మగుచుండెడిది . నేడు భయ క్రౌర్యములతో నిండిన నామనశ్శరీరములు మాఱిప్పడి పోయినవి. .

(ప్రవేశము రోహిణి కన్నీటితో)

ఏమి -రోహిణీ!

రోహి: ప్రభూ! ప్రమీలా దేవి ... ... ...

వీర : ... మ ర ణిం చి న దా? ...

రోహి: అకస్మాత్తుగా కందకములోఁబడి .....

వీర : ..ఏడువకుము, రోహిణీ! ఏడువకుము ... ప్రాణులకు ఎప్పటి కైనను మరణము తప్పదు.

(రోహిణి తిన్నఁగా పోవును)

కాని వేళ మరణించినది ... రేపు మరణించి యుండి నచో సంతాపపడుటకైనను కాలము చాలియుండెడిది. ఊఁ. .మరణమునకును సమయాసమయము లెందుకు? . రేపు రేపని కాలచరిత్రలో తుది యక్షరము వఱకును ప్రాణులు వంచితులై చిట్టచివఱకు మరణధూళిలో మాయ మగుచున్నారు. అంతరించుచున్నది క్షణికమైన యీ జీవితపువెలుఁగు. ఏమి ఈ మానవ జీవితము అంతస్సార శూన్యమై మసక చీఁకటిలో నటునిటు తిరుగుచున్న ఛాయ హా స్వప్నము కాని

నీడ . రంగస్థలము మీఁద కొన్ని నిమిషములపాటు ఉద్రేకపడి నర్తించి అంతటితో కంటికగపడని నటన ... మతి హీనుఁడైన ఉన్మత్తుఁడు అర్థవికలముగా కల్పించిన కట్టుకథ . ప్రమీల మరణించినది. .

(ప్రవేశము దండనాథుఁడు)

దండ : ప్రభూ! పట్టణము శత్రువులచేఁజిక్కినది. మన సైన్య దళములు కొన్ని వారివంకకు తిరిగిపోయినవి. దుర్గము వైపు వచ్చుచున్నారు.

వీర : రాజద్రోహులతో నిండిన ఆపట్టణము పాములపుట్ట! శత్రువులపాలగుటయే మేలు ! దుర్గము సర్వవిధముల సంరక్షింపవలయును—

(దండనాథుఁడుపోవును. ప్రవేశముభటుఁడు)

భటు : ప్రభూ! ఆశ్చర్యము!! ఆశ్చర్యము!!!

వీర : ఎవరి కాశ్చర్యము? ఏ మాశ్చర్యము?.. ప్రమీల మరణించినది . అద్భుత భయ విషాదములు మాకు అనుక్షణ పరిచితములు!

భటు : ప్రభూ! నేను కోటబురుజుపైనుండి పరీక్షించుచుండఁగా శైలారణ్యము కదలివచ్చునట్లగపడినది.

వీర : పాతకీ! నీకన్నులకు మైకము క్రమ్మి యున్నది. గ్రుడ్లు పీకించినఁగాని చూపు సరిపడదు. అరణ్యమేమి - కదలి వచ్చుటేమిరా?

భటు : నేను మరల మరల పరీక్షించి వచ్చితిని, ప్రభూ!

వీర : ఆమాట నిజము కానిచో నిన్నా చెట్టుకు వ్రేలాడఁగట్టి కొంచెముకొంచెముగా ఉరితీయించెదను!

(ప్రవేశము మఱొక భటుఁడు భయాతురుఁడై)

ఏమి ?

భటు : అరణ్యము ముందుకునాఁగివచ్చుచున్నది.

వీర : (వినకయే) కుమార్! రమ్ము మనముపోయి చూచెదము. (బురుజుపైనెక్కి-చూచి) ప్రళయము. .ప్రళయము ... .కుమార్! చూడుము. నీ కెట్లగపడుచున్నది?

కుమా : అరణ్యము ముందుకు సాఁగి వచ్చుచున్నది. మన దుర్గముపైఁ బడునట్లున్నది.

వీర : . . .ఆ వికృతి మాయాస్వరూపము నన్ను వంచించినది .. అధోగతిపాలుచేసినది అంధకారము .అంధకారము దుర్గము కూలిపోవుచున్నట్లున్నది. .నా బాహువు లింతలో నింత నీరసపడిపోవుచున్న వేమి? శత్రువులకు చిక్కిపోవుదునా?. నన్ను బంధించి యొకానొక వికృతజంతువును ప్రదర్శించునట్లు పురవీధులలో న న్నూరేగించి అసహ్యావమానముల కగ్గముచేసి ఆవల ఏ చెట్టుకొమ్మకో ఉరితిబండకో నా శిరస్సును బలి యీయఁగలరు!

(గంట వినిపించును)

కుమా : ప్రభూ! ఆదృశ్యమును చూచి మీ రింత నిర్విణ్ణులగు టెందులకు?అది నిజమే యైనచో సామాన్యజను లందఱు దాని విపరీతఫల మనుభవింపఁగలరు.

వీర : కుమార్! దానిరహస్యము నాకొక్కనికే తెలియును. నీ వెఱుఁగవు.. అది నామరణఘంట!

కుమా : వీరులకు మరణభయము లేదు.

(తుపాకి కాల్పులు. తర్వాత కత్తియుద్ధముకలకలము. రణసింగ్ అనుమాట గట్టిగా వినఁబడును. కుమార్ కత్తి దూసి నిష్క్రమించును)

వీర : వీరులకుమరణ భయము లేదు. అయోనిజుఁడు కానివాఁ డెవ్వఁడును నన్ను చంపలేఁడు.

(వీరసింహుఁడు నిష్క్రమించుచుండఁగా,కుమార్ పొడువఁబడి రంగస్థలముమీఁగ పడిపోవును. వెంటనే రణసింగ్ ప్రవేశము.)

రణ : పాతకీ! నీకొఱకై వెదకివచ్చితిని.

వీర : రణసింగ్! వెనకకు తిరిగి పొమ్ము. నీ రక్తముచే నా చేతు లిప్పటికే మలినపడియున్నవి.

రణ : ఆమాలిన్యము నీహృదయరక్తముచే కడిగివేసెదను.

వీర : నీప్రయాస వ్యర్థము! నా ప్రాణములు మంత్రరక్షితములు!

రణ : నీవంటిపాపిని రక్షింపఁగల మంత్రతంత్రములు లేవు. ఉన్నను అవి అమోఘములు కావు.

వీర : (వికటహాసము) అయోనిజుఁడు కాని వాఁడెవ్వఁడును నన్ను చంపలేఁడు.

రణ : అట్టైన ముమ్మాటికి నాచేత నీకు మరణముతప్పదు. అకాలమున తల్లిగర్భమును చీల్చుకొని పుట్టినవాఁడను! నేను అయోనిజుఁడను- నీకు మృత్యువును!!

వీర : (నిశ్చేష్టుఁడై పోయి) వి ధి బ లీ య ము.

రణ : పిఱికివాఁడా! ఆఖడ్గము నీవు పాఱవేయుము.

వీర : రణసింగ్! మాటలు మిగులుట వీర లక్షణము కాదు. .

రణ : వీరలక్షణము! ఆఁడువారు పసిపిల్ల లున్న యింటిని చుట్టుముట్టి తగులఁబెట్టించుట వీరలక్షణము . అతిథిగా ఇంటికివచ్చిన మహారాజు నిద్రించుచుండఁగా చీఁకటిలో దొంగవలె ఆతని మందిరము చొచ్చి పొడిచి వేయుట వీరలక్షణము ..నీచులైన హంతలను ప్రేరించి కనుమూసినవేళ స్నేహితుని చంపించుట వీరలక్షణము .. అమాయికులైన ప్రజలను ఉరితీయించుట వీధులలో కాల్పించుట వీరలక్షణము!!! అపవిత్ర రాజ్యకాంక్షా పిశాచమా!

(కత్తితో పైకురుకును. వీరసింహుఁడు యుద్ధము చేయుచు ప్రక్క తెర దగ్గఱకు పోవునప్పటికి రణసింగ్ పొడిచివేయును వీరసింహుఁడు తెరలో పడిపోవును)

(ప్రవేశము జయసింగ, యువరాజు)

జయ: రాజ్యము నావరించిన శాపచ్ఛాయ అంతరించినది.

రణ: ప్రభూ! గ్రహణము సంపూర్ణముగా విడిచిపోయినది.

యువరా: (మిత్రులను కౌఁగలించుకొని) నా ప్రాణమిత్రులకు ఋణబద్ధుఁడను. ప్రజావిముక్తి యీనాఁటికి సాధింపఁగలిగితిమి. ధర్మపాలుని యశః పతాకము మరల ఈ రాజ్యమున ధర్మరక్షణముచేయఁగలదు!

[ తెర ]



★

Vivekananda Press. Nellore.